ఓం

శ్రీ హాలాయుధాయనమః

# తృణధాన్యములు.

వరి, గోధుమ, జొన్న, చోడి మొదలగు గడ్డిజాతుల గింజలు తృణధాన్యము లనబడును. ఇవియే మానవకోటి కాహారముగ నుపయోగించు పదార్థములలో ప్రధానములు. ప్రపంచమందలి సుమారు 200 కోట్ల మానవుల యాహారము నందును నూటికి సుమారు 60 వంతులు తృణధాన్యముల మూలముననే లభించుచున్నవి. చాల దేశములం దితరగతి సస్యములు మెండుగ సాగు చేయబడుచున్నవి. ప్రపంచమందలి మొత్తపు సేద్యపుభూమిలో నూటికి సుమారు 50 వంతులకు పైగా తృణధాన్యములాక్రమించుకొనుచున్నవి[1]. ఇండియాలోని సాగు భూమిలోనివి నూటికి సుమారు 65 వంతులు ఆక్రమించుకొనుచున్నవి[2]. 1939-40సం॥ నందు చెన్నపురి రాజధానిలో సాగయిన 36,280,212 ఎకరములలోనివి 23,009,775 ఎకరములందు పైరు చేయబడెను. తెలుగుజిల్లాలలో నీసస్యములు సాగు చేయబడు విస్తీర్ణము (సగటు) పత్రిక-పుటలో చూపబడెను.[3]

| | | విస్తీర్ణము (ఎకరములు) |
|---|---|---|
| 1. | విశాఖపట్నం | 1,505,400 |
| 2. | తూర్పుగోదావరి | 877,290 |
| 3. | పడమటిగోదావరి | 761,530 |
| 4. | కృష్ణ | 818,200 |
| 5. | గుంటూరు | 1,358,280 |
| 6. | నెల్లూరు | 1,194,160 |
| 7. | కర్నూలు | 1,295.250 |
| 8. | బళ్లారి | 1,439,040 |
| 9. | అనంతపురం | 1,146,980 |
| 10. | కడప | 745,250 |
| 11. | చిత్తూరు | 624,110 |
| | మొత్తము | 11,765,490 |

వరి, జొన్న, మొక్కజొన్న, సజ్జ లేక గంటె, చోడి లేక తమిద, కొర్ర, అరిక, సామ యివి యీ రాజధానిలో పైరు చేయబడు తృణధాన్యములలో ముఖ్యములు. తెలుగు జిల్లాలలో నివి సాగుచేయబడు విస్తీర్ణము ప్రక్క పుటలో తెలుపబడును.[3]

| | ఎకరములు |
|---|---|
| వరి | 4,148,380 |
| జొన్న | 3,255,860 |
| కొఱ్ఱ | 1,404,950 |
| గంటె | 1,198,320 |
| చోడి | 778,330 |
| అరిక | 288,510 |
| సామ | 149,020 |
| మొక్కజొన్న | 51,610 |
| ఇతరములు | 400,510 |
| మొత్తము | 11,765,490 |

పరిగ లేక బరిగ, ఊద ఇవి కొన్ని జిల్లాలలో సాగు చేయబడుచున్నవి. సకెరలు, దిసకిలు అనునవి విశాఖపట్నపుజిల్లాలో నరుదుగ సాగు చేయబడుచున్న మరి రెండు తృణజాతులు. గోధుమ యీ రాజధానిలో తగినంత శీతలముగ నుండు కొన్ని ప్రదేశములందు మాత్రమే స్వల్పముగ సాగు చేయబడుచున్నది.

తృణధాన్యజాతులు దుబ్బులుగా పెరుగు చిన్న మొక్కలు. వీని వేళ్లు నారువేళ్లు. తల్లివేరుండదు. పీచువంటి సన్ననివేళ్లు కాండపు అడుగు

భాగమునుండి విస్తారముగ బయలుదేరును. కాండము కణుపులుగలిగి సామాన్యముగ కొమ్మలు రెమ్మలు లేక నిడివిగ పెరుగును. క్రిందికణుపులు కొన్ని చాల దగ్గరగ నుండును. ఇట్లు కణుపులు దగ్గర దగ్గరగ నుండు కొంత కాండభాగము భూమియందే యుండి యందలి కణుపులనుండి కూడ వేళ్లు బయలుదేరును. కొన్ని జాతులలో నేలపై నుండు కణుపులనుండి కూడ వేళ్లు బయలుదేరుట గలదు.

కణుపునకును కణుపునకును మధ్యనుండు కాండభాగము కొన్ని జాతులలో బోలుగనుండును. కాండపు ఊపరిభాగము ఎండినపుడు కొన్నిటిలో పేడుగట్టి గట్టిగ నుండును. ఉ. జొన్న, మొక్క జొన్న. ఇట్టిజాతుల మొక్కలు పండినవెనుక గూడ వ్రాలిపోక నిలచియుండును. కొన్నిజాతులు పండుసరికి కాండము తగినంత గట్టితనము లేక తరుచు నేలపై వ్రాలిపోవును. ఉ. వరి.

ఆకులలో తొడిమ, రేకు అను రెండు భాగములుండును. తొడిమ తరుచు కాండమును జుట్టి యుండును. రేకు తక్కువ వెడల్పు ఎక్కువ పొడవును గలిగి స్ఫుటమైన మధ్య యీనె గలిగి యుండును. అంచులు కొద్ది గొప్ప గరిగా నుండును. సామాన్యముగ తొడిమ యొక్కయు, రేకు యొక్కయు సంధియందు లోపలివైపున "మించు" అను చిన్న ఉపదళముండును.

పూవులు మిగుల చిన్నవి. కాండముల కొనలందు గుత్తులు గుత్తులుగా బయలుదేరును. ఈ గుత్తులకు వెన్నులు లేక కంకులు అని పేరు. ఒక్కొక వెన్ను లేక కంకి అనేకశాఖలు (రెల్లలు) ఉపశాఖలు (పిల్లరెల్లలు) గలిగి యుండును. వీనితొడిమలు తరుచుగ సన్నముగా

వెన్ను ముద్దవెన్నుగ లేక కంకిగనుండును. ఉ. గంటె, ముద్దజొన్న. తోడిమ కొద్ది గొప్ప నిడివిగ నుండు వానిలో వెన్నులు రెల్ల లేక రింజ వెన్నులుగ నుండును. ఉ. వరి, చామ. తోడిమెలు మిగుల కురుచగనుండు పిల్ల రెల్లలకు కణిశములని పేరు. ఒక్కొక్క కణిశమున కొన్ని అల్ప (చిన్న) కణిశము లుండును. ఒక్కొక్క కణిశము మధ్య నొక సన్నని కాడయు, గాని ప్రక్కలను 3, 4 లేక అంతకంటె హెచ్చుసంఖ్యగల తుషములు అనబడు నూకపొట్టులవంటి చిన్న దళము లుండును. ఇందు సామాన్యముగ అడుగు రెండింటిలోను గాక పై దళములపంగలలో పుష్పము లుండును ఈ పుష్పములుండు పంగలలో బుసమనబడు నొక్కొక్క మృదువైన దళము నుదయొకటి యుండును. ఇది పుష్పమును బట్టి యుండును. దానిలోమాత్ర మిడి యుండును. పుష్పమునందు సామాన్యపు పుష్ప జాతులలో నుండునట్లు రక్షక పత్రములకును, ఆకర్షక పత్రములకును బదులుగా, రెండుగాని (అరుదుగా 3 లేక 6గాని) కండబారియుండు ఉన్మదరికములు అను ఈ పదళము లుండును. వీని సంకోచ వ్యాకోచముల వలననే పూవును గట్టియుండు తుషబుసములు వీడుటయు మరల మూసికొనుటయు జరుగును. కింజల్కములు సామాన్యముగ 3 ఉండును. 6 గాని (ఉ. వరి.) కొన్నిటిలో అరుదుగ 1, 2 గాని ఉండుటయు గలదు. పుప్పొడితిత్తి రెండు అరలు గలిగి యుండును. అండకోశము సామాన్యముగ ఒకే యర గలిగ యుండును కీలము రెండుగా చీలియుండును. కీలాగ్రము యీకవలెనుండును. మనము సామాన్యముగ గింజయనునదే తృణధాన్యపు ఫలము. ఇది తరుచు కొంతవరకు గాని, పూర్తిగ గాని, బుసముచేతను, దానికి సంబంధించిన తుషముచేతను కప్పబడి యుండును. కాని యివి దానిపై నంటుకొని పోవుటరుదు ఇట్లు ఫలమును పరివేష్టించియుండు తుషములనే మనము ఊకపొట్టులు లేక బొంతు అందుము. గింజ నంటియుండు పైపొరయే ఫల కవచము. ఇందు ఒకటికంటె నెక్కువ గింజ లుండవచ్చును.

గింజయందు అంకుర మొక మూలనంటి చిన్నదిగ నుండును. దీనినే సామాన్యముగ "ముక్కు" అందురు. తక్కిన భాగము అంకురము మొలకెత్తినపుడు దాని పోషణకొఱ కేర్పడిన యంకురచ్ఛదనమే.

ఈ రాజధానిలో పైరు చేయబడు ముఖ్య తృణధాన్య జాతులు చాల భాగ ముష్ణమండలవాసు లగుటచే, తగినంత ఉష్ణమయు, తేమయు లభించు వర్షకాలముననే బాగుగ బెరుగును. వర్షపాతముయొక్క పరిమితిని బట్టియు ఆయా జాతులకు గావలయు ఉష్ణతా పరిమాణమును బట్టియు కొన్ని జాతులు వర్షకాల ప్రారంభమునను కొన్ని మధ్యమునను కొన్ని అంతమునను సాగు చేయదగియుండును కొంత శీతలమున సాగునట్టి గాని, లేక కొంత శీతలమునుగోరునట్టి గాని వరిగ, గోధుమ మొదలగునవి శీతకాలముననే సాగు చేయదగియున్నవి కొన్నిజాతులు ఉష్ణతను శీతలమును గూడ నోర్వగలవు. ఉ. మొక్కజొన్న. ఇట్టి సస్యములను వర్షకాలమున శీతకాలమునను గూడ సాగుచేయ వీలగును. నీటిపారుదల గల భూములలో ఉష్ణమున బాగు జాతులు వేసవిలో గూడ సాగు చేయ వీలగును. ఆయా సస్యము లోర్వగల తేమనుబట్టి కొన్ని హెచ్చు వర్షములు గురియు ప్రాంతములకును, జిగురు నేలలకును (ఉ. వరి,) కొన్ని తక్కువ వర్షముగురియు ప్రాంతములకును, తేలిక నేలలకును (ఉ. గంటె) అనుకూలములు.

ఓం

శ్రీ హలాయుధాయనమః

# వరి

## (Paddy—Oryza sativa)

ఆంధ్రదేశమున, మళయాళమున—నెల్లు; కన్నడమున—బట్ట; ఒఢ్రమున—ధాన్య; హిందూస్థానీలో—ధాన్; సంస్కృతమున. వ్రీహి.

### 1. చరిత్ర, వ్యాపకము.

ప్రపంచమున విస్తారముగ సాగు చేయబడు చున్నట్టియు బహుజనుల కాహారమగు చున్నట్టియు సస్యములలో వరి యొకటి. గోధుమ తప్ప దీనికంటె హెచ్చు విస్తీర్ణమున సేద్యము చేయబడుచున్న సస్యమింకొకటి లేదు.

దక్షిణహిందూదేశము గాని ఆసియా ఖండపు ఆగ్నేయ భాగమందలి మరియొక దేశము గాని వరి కాదిమ స్థానమై యుండవచ్చునని యూహింపబడుచున్నది.[4] ఈ ప్రదేశములం దిప్పటికిని కొన్ని వన్యజాతుల వరులు గానవచ్చును. కొల్లేరుసరస్సు పరిసరములందును, ఉత్తరసర్కారులలోని శైలు బా[illegible] ప్రక్కలనున్న కొలుములలందును,

కొన్ని చెరువుగర్భము లందును గానవగు "నివారి" వరి యిందు కుదాహరణము.

వరిసాగు మిగుల ప్రాచీనమైనదని చెప్పవచ్చును. ఇంతవరకు లభించిన చారిత్రికాధారములలో మిగుల ప్రాచీనమైనదానిని బట్టి క్రీ॥ పూ॥ 2800 సం॥ల క్రిందటనే యీ సస్యము చీనాలో సాగుచేయబడు చుండెనని తెలియవచ్చుచున్నది. ఆదేశమున నిప్పటికి 4700 యేండ్లకు పూర్వము రాజ్యము చేసిన యొక చక్రవర్తి కాలమున ఏటేట, తొలుత స్వయముగ నాతడే యీ ప్రధాన సస్యమును విత్తుటయు. పిమ్మట రాజకుటుంబమునందలి యితర ప్రముఖులలో నొక్కొక్క రొక్కొక్క యితర సస్యమును విత్తుటయు నాచారముగ నుండెనట.[4] చీనాకు వ్యాపింపకముందు కొంత కాలము నుండియు ఆదిమస్థానమున నీ సస్యము సాగు చేయబడుచుండి యుండవలెనుగదా!

అసియాఖండపు ఆగ్నేయభాగమునుండి చీనాకు వ్యాపించినపిమ్మట కొంత కాలమునకు, హిందూదేశమునుండి పారసీకము, మధ్య ఆసియా, అరేబియా, ఈజిప్టు దేశములకును ఐరోపాఖండపు దక్షిణ భాగములకును యీ సస్యము వ్యాపించియుండునని శాస్త్రజ్ఞు లూహించుచున్నారు.[5] వ్రీహి యను సంస్కృత శబ్దమునకును, విరింజియను ప్రాచీన పారసీకపు పేరునకును మిగుల దగ్గరసంబంధ ముండుటచే పారశీకము నందార్యులు రెండు శాఖలుగ విడిపోకముందే అచటికి వరిసాగు వ్యాపించి యుండునని యూహింపబడుచున్నది. ఋగ్వేదమున వ్రీహిశబ్దము గాని దాని పర్యాయ పదము గాని కానరాకుండుటచే నా కాలమునాటి ఆర్యావర్తమునకు వరిసాగు ప్రాకియుండినట్లు తోచదు. కొందరు చారిత్రికులు[6] ఈదేశపు వాయవ్యపుభాగమే ఆర్యుల యాదిమస్థానమై యుండెననియు, ఋగ్వేద కాలము

నను పిమ్మటనే వారిలో నొకశాఖ పారసీకమునకు బోయియుండునని యు తెలియుచున్న అభిప్రాయము సరియగుచో వరిసాగు ఋగ్వేదకాలము నకు పిమ్మటనే ఆర్యావర్తమునకు ప్రాకి, పిమ్మట అచటనుండి పశ్చిమము నకు వ్యాపించి యుండునని యూహింపదగియుండును.

ఋగ్వేదమున వ్రీహి ప్రశంస గానరాకపోయినను యజుర్వేదమున ప్రశంసింపబడిన సప్త(గ్రామ్య) ధాన్యములలో[7] నిదియొకటియని విద్యార ణ్యులు తమ భాష్యమున వ్రాసిరి. ఐతరేయ బ్రాహ్మణమున[8] మహావ్రీహి (పెద్దవరి) యను శబ్దము గానగను. పాణిని అష్టాధ్యాయి[9] యందును బృహదారణ్యకోపనిషత్తు[10] నందును వ్రీహి ప్రశంస గలదు. బౌద్ధ కాలమున వరిసాగు కొంచెమించు ఇప్పటివలెనే సలక్షణముగ జరుగు చుండెనని కౌటిల్యుని యర్థశాస్త్రము[11] తెలుపుచున్నది. ఈ కాలము ననే రచియింపబడి యుండునని యూహింపబడుచున్న వాల్మీకి రామా యణము[12] నందును, మహాభారతము[13] నందును గూడ వరిపైరు ప్రశంస గలదు. పౌరాణిక కాలమున పెక్కు రకముల వరులు సాగు చేయబడు చుండెనని వాగ్భటుని యష్టాంగ హృదయము[14] తెలుపుచున్నది. మహమ్మదీయ కాలమున గూడ కొంతవరకు నీటివసతు లభివృద్ధి నొంది వరిసాగు విస్తారముగ నుండెనట్లు ఆ కాలపు వ్రాతలవలన దెలియవచ్చు చున్నది. ప్రస్తుతపు బ్రిటిష్ పాలకులు దేశము నాక్రమించిన పిమ్మట ననేక నదులకు కానకట్టులు నిర్మింపబడుట చేతను, అనేక క్రొత్త కాలు వలు చెరువులు నిర్మింపబడుట చేతను వరిసాగు మిక్కిలి విస్తరించెను. ఆయా రాష్ట్రములందు వ్యవసాయశాఖలను ప్రత్యేకముగ నెలకొల్పిన పిమ్మట వరి రకములను గూర్చియు, సాగును గూర్చియు కొంత శాస్త్రీయమగు పరిశోధన కూడ జరుగ నారంభించుటచే వరిసాగు విస్తీర్ణమునసే గాక పైరుచేయు విధానమునగూడ కొంత యభివృద్ధి గలిగెను.

పైని చెప్పినట్లు మిక్కిలి ప్రాచీన కాలమందే హిందూదేశము నుండియో, ఆసియాఖండపు ఆగ్నేయ భాగము నందలి యే యితర ప్రదేశము నుండియో, ఆసియాఖండపు యితర భాగములకును, ఐరోపా, ఆఫ్రికా ఖండములకును, ఇటీవల అమెరికా మొదలగు పశ్చిమార్ధగోళము నందలి దేశములకును వ్యాపించి యుండుటచే నీ పైరిపుడు కొంచె మించుమించు ప్రపంచమం దది పెరుగ వీలుగల ప్రదేశము లన్నిటి యందును కొద్దిగనో గొప్పగనో సాగుచేయబడుచున్నది. అయినను హిందూదేశమే యీ పైరు సాగుచేయబడు విస్తీర్ణమున ప్రధాన స్థానము నాక్రమించి యున్నది. బర్మాకూడ కలిపిన నిందేటేట సుమారు 8½ కోట్ల యెకరము లీ సస్యపు సాగుక్రింద నుండును.[1] బర్మా వదలినచో ఇండియా యందలి వరిసాగు విస్తీర్ణము 1937-38వ సం॥ లెక్కలప్రకారము సుమారు 7¼ కోట్ల యెకరములు. బర్మాలో ప్రత్యేకముగ 129లక్షల యెకరముల వరిసాగుండెను. చీనాదేశమునకూడ నీసాగు విశేషముగ గలదు. కాని యందీ సస్యము సాగు చేయబడుచున్న విస్తీర్ణమును దెలుపు అంకెలు లభింపకున్నవి. సుమారుగ నైనను అంకెలు లభించినంతవరకు లక్ష యెకరములకు పైబడిన విస్తీర్ణముగల కొన్ని యితర దేశము లందలి వరిసాగు విస్తీర్ణము ఈ క్రింది పట్టికయందు చూపబడెను.[2]

| | 1937 వ సం॥న విస్తీర్ణము లక్షల యెకరములు |
|---|---|
| 1. ఇండోచీనా | 139 |
| 2. బర్మా | 129 |
| 3. జావా | 95 |
| మొత్తము | 363 |

1937 వ సం॥ న విస్తీర్ణము
లక్షల యెకరములు

| | |
|---|---|
| వెనుకటి పుటనుండి | 363 |
| 4. జపాన్ | 79 |
| 5. సయాం | 71 |
| 6. ఫిలిప్పైన్ దీవులు (1926) | 43 |
| 7. కొరియా | 40 |
| 8. ఫ్రెంచిగయానా (1926) | 20 |
| 9. ఫార్మోజా (1926) | 16 |
| 10. మెడగాస్కర్ (1926) | 14 |
| 11. బ్రెజిల్ (1926) | 13 |
| 12. అమెరికాసంయుక్తరాష్ట్రములు | 11 |
| 13. సింహళము (1926) | 8 |
| 14. బ్రిటిష్ మలయా (1926) | 7 |
| 15. ఆసియాయందలి రష్యా (1926) | 6 |
| 16. సీరాలియోన్ (1926) | 4 |
| 17. ఇటలీ (1926) | 4 |
| 18. ఈజిప్టు | 3 |
| 19. సెనిగల్ (1926) | 1 |
| 20. స్పెయిన్ (1926) | 1 |
| 21. మెక్సికో (1926)[1] | 1 |
| మొత్తము | 705 |

పై ప్రదేశములందు గాక ఆసియాఖండపు ఆగ్నేయ భాగమున నున్న యితర ద్వీపము లందును, ఆఫ్రికా ఖండము నందలి సూడాన్, మడగాస్కర్, మొదలగు ప్రదేశము లందును, ఆస్ట్రేలియాలో న్యూసౌత్ వేల్సు, క్వీన్సులాండు, శాండ్విచ్‌దీవులు మొదలగు ప్రదేశము లందును, అయిరోపా ఖండమున పోర్చుగల్, గ్రీస్, బలేరియా దేశములందును, దక్షిణ అమెరికాలో బ్రిటిష్ గయానా, హాండూరాస్, జమైకా మొదలగు ప్రదేశము లందును కొంత వరి సాగు గలదు. కాని ఏషియాను వదలి తక్కిన దేశము లన్నిటి యందును వరి సాగునందున్న విస్తీర్ణముతయు కలసి హిందూదేశములో నీ పైరు ఏటేట సాగుచేయబడు విస్తీర్ణ మంత లేదు.

చీనాలో గూడ సుమారు ఇండియాలో నున్నంత విస్తీర్ణము గాని అంతకు హెచ్చు గాని యుండవచ్చును. దీనిని గూడ చేర్చుచో ప్రపంచ మండలి వరిసాగు విస్తీర్ణము మొత్తముమీద సుమారు 20 కోట్ల యెకరము లకు మించియుండునని యూహ సేయవచ్చును.

హిందూదేశమున నాయా రాష్ట్రములందు 1937–38 సంవత్సరమున వరి సాగయిన విస్తీర్ణ మీ క్రిందిపట్టిక వలన తెలియును.*

| | లక్షల యెకరములు |
|---|---|
| 1. బంగాళా రాజధాని | 222 |
| 2. చెన్నపురి రాజధాని | 101 |
| 3 బీహార్ | 95 |
| మొత్తము | 418 |

| | | లక్షల యెకరములు |
|---|---|---|
| | వెనుకటి పుటనుండి | 418 |
| 4 | సంయుక్తరాష్ట్రములు | 70 |
| 5. | మధ్యరాష్ట్రములు—బీరారుచేరి | 57 |
| 6 | ఒరిస్సా | 51 |
| 7 | అస్సాము | 50 |
| 8. | బొంబాయి | 19 |
| 9. | సింధు | 12 |
| 10 | తూర్పు ఏజన్సీ సంస్థానములు | 20 |
| 11 | నిజాంరాష్ట్రము | 10 |
| 12 | మైసూరు | 7 |
| | మొత్తము | 714 |

పై లెక్కలలో జేరని ప్రదేశములందు సుమారు మరి 10 లక్షల యెకరముల వరి సాగుండవచ్చును. మొత్తముమీద యిండియాలోని వరి సాగు విస్తీర్ణము పైనివ్రాసినట్లు సుమారు 7¼ కోట్లుండును.

పై లెక్కలను బట్టి చూచిన యెడల వరిపంట విస్తీర్ణమున చెన్నపురి రాజధాని ఆయా రాష్ట్రములలో రెండవ స్థానము నాక్రమించుచున్నదని తెలును.

చెన్నపురి రాజధాని యందలి వరి విస్తీర్ణమున సుమారు సగ మాంధ్ర దేశము నందున్నది. ఆయా జిల్లాలలో సామాన్యముగ వరి సాగు నందుండెడి విస్తీర్ణ మీక్రింద చూపబడెను.

| జిల్లా | జలాధారముల క్రింద సాగు వరి విస్తీర్ణము | వర్షాధారమున సాగు వరి విస్తీర్ణము |
|---|---|---|
| విశాఖపట్నం | 776,000 | 89,900 |
| తూర్పుగోదావరి | 589,000 | 72,100 |
| పడమటిగోదావరి | 635,000 | 45,000 |
| కృష్ణా | 549,000 | 21 200 |
| గుంటూరు | 346,000 | 44,200 |
| నెల్లూరు | 410,000 | 29,100 |
| చిత్తూరు | 180,000 | 11,000 |
| కడప | 107,000 | 2,940 |
| అనంతపురం | 108,000 | 1,020 |
| బళ్లారి | 33,100 | 3 430 |
| కర్నూలు | 60,300 | 10,500 |
| మొత్తము | 3,793,400 | 330,390 |

ఈ రాజధానిలోని యితర జిల్లాలలో వరిసాగు విస్తారముగ గలది తంజావూరు. ఇందు 1,046,000 యెకరములు జలాధారముల క్రిందను 86,400 యెకరములు వర్షాధారమునను సాగగుచున్నవి. దీని తరువాత మలబారు దక్షిణకన్నడ జిల్లాలు వచ్చును. ఇందు వరుసగా 874,000, 582,000 ఎకరములును వర్షాధారముననే సాగగుచున్నవి. ఇచ్చట వర్షము చాల హెచ్చుగ గురియుటచే జలాధారముల యవసరము లేదు.

## 2. వరియొక్క లక్షణములు.

తృణధాన్యజాతుల సామాన్య లక్షణములు 3-6పుటలందు దెలుపబడెను. ఇచట వరిదుబ్బుల ప్రత్యేక లక్షణములు వివరింపబడును.

10 వ పటము



వ రి చే ను.

## 11 వ పటము



వరి దుబ్బు.

మన మొక్క వడ్లగింజను నీటిలో నానబెట్టినచో రెండు దినములలో మొలకెత్తనారంభించును ముందు మొలక (Plumnle) గను పిమ్మట ప్రథమమూలము (Radicle)ను బయలుదేరును.

వరి మొక్క వేళ్లు నారవేళ్లు. మొదట ప్రథమూలమునుండియు క్రమముగా మొలక యందేర్పడు కాండపు క్రింది కణుపులనుండియు యివి విస్తార

12 వ పటము



మొలకెత్తుచున్న
వడ్లగింజ

ముగ పుట్టును. ప్రతివేరును కొన్ని చిన్న చిన్న పిల్లవేళ్లను, మూలరోమములను గలిగి యుండును. వేళ్లు పొద పెరిగిన కొలదిని వాని మొదటి భాగము ఆహారమును తీసి కొనుట మానును. క్రొత్త వేళ్లు పుట్టిన కొలదిని కొన్ని పాతవేళ్లు చచ్చుచుండును.

13 వ పటము



వరి వేళ్లు

14 వ పటము



వరి మొక్క — సుమారు ఒక నెల వయసుగలది.

మొలకనుండి క్రమముగ కాండమును, ఆకులును ఏర్పడును. కాండము కణుపులు కలిగి యుండును. మొక్క మొలచిన వెనుక సుమారు రెండు నెలల వరకు నీ కణుపులు మిగుల దగ్గర దగ్గరగ నేర్పడుచుండుటచే నీ కాండ భాగమంతయు భూమిలోనే యుండును. కొన్ని పై కణుపుల మధ్య భాగములు పిమ్మట పొడవుగ పెరుగుట వలన కాండము భూమిపైకి వచ్చును. సామాన్యముగ పై 4, 6 కణుపుల మధ్య భాగములు మాత్రమే వెన్ను వేయబోవు ముందు చురుకుగను మరింత పొడవుగను పెరుగును. కాండపు మొత్తపు పొడవు సుమారు 3.6 అడుగులుండును. కొన్ని నీటి ముంపువరులు 20 అడుగుల వరకు పెరుగుట గలదు. కణుపుల మధ్యనుండు కాండ భాగములు బోలుగ నుండును.

15 వ పటము



వరిదుబ్బులు—సుమారు 4 నెలలు వయస్సుగలవి.

కాండములుగాదు దూరముగ [illegible] ప్ర

ఏర్పడి విడివిగ నెదిగినవి.

ప్రతి కణుపు నుండియు నొక ఆకు బయలుదేరును. ప్రతి యాకు పంగలోను ఒక్కొక్క శాఖాంకుర ముండును. భూమి యందుండు కణుపు లందలి శాఖాంకురములు కొన్ని పిల్కలుగా బయలుదేరును. ప్రతికూల స్థితిగతులందొక్కొకపుడు భూమి పైనున్న కణుపులనుండి కూడ పిల్కలు బయలుదేరుట గలదు. భూమిలోనుండు కణుపులనుండి పుట్టిన పిల్కల నుండి కూడ మరల పిల్కలు పుట్టుచుండును[17]. మొక్కయొక్క జీవితపు మొదటి రెండు మూడు నెలలలోను ఇట్లు విస్తారముగ పిల్కలు బయలు దేరును. కాని అందు కొన్ని పిమ్మట యంతరించును. సామాన్యముగ వెన్నువేయు పిల్కలు 4-10 వర కుండును. ఒకొక్కప్పుడు సస్య పరిదేశములలో పెరుగు యొంటరి దుబ్బులలో 100-150 పిల్కల వర కుండుట గలదు. పిల్కలు వృద్ధియయిన కొలదిని వాని క్రింది కణుపుల నుండి యనేకములగు వేళ్లు పుట్టును.

16వ పటము




1. తొడిమ. 2. రేకు. 3. సంధి. 4. మీసము. 5. మించు.

గింజ మొలచునపుడు పుట్టు మొదటి రెండాకులును కొంచె మించు మించు గొట్టములవలె నుండును. మూడవ యాకునందును, తరువాతి యాకులందును తొడిమ, రేకు అని రెండు భాగము లుండును. తొడిమ కాండమును జుట్టి ఒక పైపున చీలిన గొట్టమువలె

నుండును. రేకు దీని కొననుండి బయలుదేరి వెలుపలికి వ్రాలియుండును. సామాన్యముగ కడపటి యాకు (కోటాకు) నకు క్రిందనుండు 4-6 ఆకులు మాత్రమే బాగుగ పెరుగును. బాగుగ పెరిగిన యాకునందు తొడిమ సుమారు 8-12 అంగుళములును రేకు 15-30 అం. లును పొడవుండును. రేకు వెడల్పు సామాన్యముగ $\frac{1}{4}$-$\frac{1}{2}$ అం. ఉండును. రేకుయొక్క అంచులు గరగలిగి యుండును.

17 వ పటము



కోటా[illegible]లు--వెన్నులు.



18 వ పటము వరివెన్ను-అందలి రెల్లలు, పిల్లరెల్లలు.

యొక్క యీదుగు కాలము ముగియు నప్పటికి కాండపు చివర భాగము వెన్నుగా వెలువడును. వెన్ను పొట్ట (గోటాకు తొడిమ) లో నుండి పైకి వచ్చుకొలదిని అందలి పూవులు విడువ నారంభించును. విడువ నారంభించు కాలమును, విడుపు ముగియు కాలమును పరిస్థితులనబట్టి యుండును. సామాన్యముగా ఉదయము 10 మొదలు 12 గంటలమధ్య నీపూవులు విడచు ముఖ్యకాలము[18]. ఈ కాలమున మబ్బు దట్టముగ బట్టినగాని, వర్షము కురిసినగాని విడచుట ఆలస్యము కావచ్చును. సూర్యరశ్మి విడచుటకు సహాయకారి.[19]

వరివెన్ను రెల్ల వెన్ను. అందు మధ్యగా నొక కాడయు (కాండముయొక్క సన్నగిలిన చివర భాగము) దాని పొడవునను అక్కడక్కడ కొన్ని శాఖలును (రెల్లలు) ఉపశాఖలు (పిల్ల రెల్లలు) ను ఉండును. ఒక్కొక పిల్లరెల్ల యందొక్కొక యుల్వ కణిశము (సామాన్యముగ దీనిని పూవు అందురు) ఉండును. ప్రతి

యల్ప కణిశము నకును నొక కురుచయగు తొడమయు, దాని చివర 4 తుషములు (ఊకపొయులు) ను ఉండును. ఇందు క్రింది (వెలుపటి) రెండు సామాన్యముగ మిగుల చిన్నవి. పై (లోపలి) రెండును పెద్దవి. నిజమగు పూవు నాల్గవ తుషములోపల నుండును. వరిపూవునందు క్రింద భాగమున పరిపత్రములకు బదులుగ ఉన్మ్రదికములను రెండంగను లుండును. ఉన్మ్రదకముల మధ్య నొక యండాశయమును దీనిచుట్టును 6 కింజల్కములును ఉండును. కొన్ని యరుదగు రకములలో నొకటికంటె

19 వ పటము — వరిపూవు (అల్పకణిశము)




విడవనిది

1. క్రింది తుషములు
2, 3 పై తుషములు
4. తుషముల కొన




విడచినది

1. క్రింది తుషములు 2. పై తుషములు 3. కింజల్కములు 4. కీలము. అండాశయము కీలమునకు అడుగున నున్నది. దాని కిరు ప్రక్కలను రెండు ఉన్మ్రదకము లున్నవి (ఇవి పటము నందు స్పష్టముగా గన్పించుటలేదు.

నెక్కువ యండాశయము లుండుట గలదు. ఒక వడ్లగింజ యందు రెండు బియ్యపు గింజలుండు రకము లిట్టివే. అండాశయముపై కీలము రెండుగా చీలిన యీకవలె మృదువుగా నుండును. తుషములు విడుచుటకు కొంచెము ముందుగనో విడుచు సమయముననో కింజల్కము లందలి పుప్పొడితిత్తులు పగిలి యందలి పుప్పొడి రేణువులు కీలముపై బడుటచే అండాశయము గర్భవతి యగును. పిమ్మట తుషములు క్రమముగా మూసికొని పోవును. కింజల్కములును, కీలమును వాడిపోవును. అండాశయము క్రమముగా పెరిగి పాలు పోసికొనును. మరికొంత కాలమునకు పాలు తోడుకొని గింజ గట్టిపడును. ముదిరిన బియ్యపుగింజ (ఫలము) తుషముల నంటకయే వానిలోపల నుండును. తుషములలోగూడిన ఫలమునే మనము వడ్లగింజ యందుము. బియ్యపు గింజపై నుండు పలుచని తవుడు పొరయే ఫలకవచము. దీని క్రింది నుండు మరిరెండు పలుచని పొరలు బీజ కవచములు. ఇవి లోని గింజను గట్టిగా నంటి యుండును. లోని బియ్యపు గింజలో నొకమూల బీజాంకుర ముండును. తక్కిన భాగము అంకుర ఛదనము 20. ఒక్కొక వెన్నునందు సామాన్యముగ 100-300 పూవులు లేక గింజలు బయలుదేరును.

సుమారు ఆరునెల లెదిగి ఫలించు వరిదుబ్బు నొకదానిని సమూలముగ దీసి యెండించిన యెండల నందు వేళ్లు నూటికి సుమారు 15 వంతులును కాండము, 40 వంతులును, ఆకులు 15 వంతులును, వెన్ను 30 వంతులును ఉండును. వెన్ను తూనికలో సామాన్యముగా రెండు వంతులు గట్టి గింజలును, 1 వంతు కాడయు పొల్లును అయియుండును.

---

ఫలించుటకు వలయు పరిస్థితు లందును భేదములు గలవు. వీనిని గురించి యీక్రింద సంగ్రహముగ తెలుపబడును.

1. ధాన్యపురంగు:— చాల రకముల వడ్ల గింజల లోపలి తుషములు అనగా వానిపై యూకపొరలు యించుక పసిమితో గూడిన తెలుపు రంగు గలిగి యుండును. ఇట్టి రకములను మనము సామాన్యముగా తెల్లధాన్యము లందుము. ఉ. మహీపాలీ, బయ్యాహుండా, కోనామణి, గుత్తికుసుమ. ఆయా రకములందలి పసిమియొక్క సాంద్రతలోకూడ భేదము లుండును. కొన్ని రకముల ధాన్యము బంగారు వర్ణము గలిగి యుండును. వీనిని సామాన్యముగ ఎర్రధాన్యము లందుము. ఇందును లేత (ఉ. హేమసన్నాలు), ముదురు(ఉ. సన్నక్కుళ్లు) భేదములు గలవు మరియు ఈ బంగారు వర్ణము కొన్ని రకములలో గింజ కొనకు మాత్రమే గాని (ఉ. గరుడవాహనాలు) కొనను క్రింది భాగమునను అనగా ముచికవద్దను కూడ గాని(ఉ. రత్నచుడి) అగపింపవచ్చును. కొన్ని రకముల ధాన్యము గోధుమవర్ణము గలిగి యుండును. ఇందును లేత(ఉ. కోసెసాంపు), ముదురు (ఉ. అట్టగరా) భేదములు గలవు. కొన్ని రకములలో ఈ గోధుమ వర్ణము గింజయంతటను సమముగ నుండక చారలుగా నుండును. ఉ. చారిబుడమ. ముదురు గోధుమ రకములు కొంచెమించు మించు ముదురు బంగారు రకములను బోలియే యుండును. సామాన్యముగ ఈ ముదురు గోధుమ రకములనుకూడ యెర్రధాన్యములనియే వ్యవహరింతుము. బంగారు వర్ణపు ధాన్యపు రకములలో ఈవర్ణము కొంతవరకు కాండమున కూడ గాననగును. గోధుమవర్ణపు రకముల కాండములలో ఈరంగు కానరాదు. కొన్ని రకముల ధాన్యమునందు గోధుమవర్ణముతో కొంత నలుపువర్ణముకూడ కలసి యుండుటగలదు. ఉ. వడ్లుఘ్నాణం. కొన్నిరకముల ధాన్యము ముదురుగ గాని నల్లగ గాని యుండును. నలుపు రకములలో కొన్ని స్వచ్ఛమయిన నలుపు రంగు

గలిగియుండును. ఉ. ఖారీఫ్ మా. ఇట్టిరకములలో పాలుగింజలు తెల్లగనుండును. కొన్ని గోధుమవర్ణముతో గూడి పైరకముల వలెనే పైకి నల్లగనుండును. ఉ. నల్లబుడమ, నల్లఆరెలు. ఇట్టిరకముల పాలుగింజలు గోధుమవర్ణముగ నుండును. కొన్ని రకముల ధాన్యము కొద్ది గొప్ప ఊదారంగు గలిగి యుండును. కొనలందు మాత్రమే ఊదారంగు గలిగి యుండు రకములు కొన్ని గలవు. ఉ. కృష్ణకాటుకలు, మోసపురులు. కొన్ని రకములలో నిది గింజ యంతటనున్నను మిగుల లేతగ నుండును. ఉ. మసిపేషాణం. ఇట్టి రకములు ఊదాతోగూడిన తెలుపు రకము లనవచ్చును. కొన్నింటిలో నిది దట్టముగ నుండును. ఉ. కాకిరెక్కలు. వీనికిని నల్ల రకములకు భేదము గుర్తించుటకష్టము. బంగారు వర్ణమును, గోధుమ వర్ణమును గల కొన్ని రకములలో గూడ వానితో జేరి కొంత ఊదా రంగుండుట గలదు. అప్పుడా రంగులతో నిది మిళితమగుట వలన వాని తేట తగ్గిపోవును.

2. బియ్యపురంగు:— బియ్యపుగింజపై తవుడుపొర యందలి రంగును బట్టి ఆయా రకముల బియ్యపు రంగు నందు భేదము లేర్పడుచున్నవి. ఈ రంగు తవుడుపొర క్రింద నుండు బీజకవచములందొక దాని యందు కాని రెంటి యందును గాని యుండవచ్చును. కొన్ని రకముల చేబియ్యము కొంచె మించు తెలుపుగ గాని మిగుల లేత గోధుమ రంగు గలిగి గాని యుండును. ఉ. మహారాజభోగం. కొన్నిటిలో నీ గోధుమ వర్ణము అంతకంటె దట్టముగ నుండును. ఉ. ఆట్రిగడా. కొన్ని కొద్ది గొప్ప యెరుపుగ నుండును. ఉ. నల్లఆరెలు. కొన్ని యరుదగురకముల బియ్యము దట్టముగ ఊదా లేక నలుపువర్ణము గలిగియుండును. ఉ. పుట్టుబియ్యము. సామాన్యముగ ననేకరకములలో తెలుపు, యెరుపు వర్ణములుగల బియ్యమునిచ్చు మొక్కలు కలసియే కాననగును. మరియు, బియ్య

[illegible] వరి రకముల నైదు తరగతులుగ విభజింపవచ్చును. 2. మి. మీ. లు గాని అంతకు తక్కువ వెడల్పు గాని గల రకములు మిగుల సన్నముగా నెంచదగును. ఉ. హంససన్నాలు. 2.1 మొదలు 2.5 మి. మీ. వరకు వెడల్పుగలవి సన్న రకములు. ఉ. మహారాజభోగం, సుంకిసన్నాలు, గుణుపుర్గంసన్నాలు. 2.6-3.0 మి. మీ. ల వెడల్పుండునవి మధ్యమములు. ఉ. నవకోటిసన్నాలు, రత్నచూడి, మొలకొలుకులు. 3.1-3.5 మి. మీ. వరకు వెడల్పుండునవి ముదుగు రకములు. ఉ. పెద్దఅక్కుళ్లు, బొబ్బిలిగంటి, కౌశామణి. 3.5 మి. మీ. ల పైన వెడల్పుగలవి మిగుల ముదుగురకములు. ఉ. శైబల్ షకేర్, కొబ్బరిపువ్వు ధాన్యము.

గింజల దళమునందును ఇట్టి ఆయా రకములలో వ్యత్యాసములు గలవు. కాని యీ వ్యత్యాసములను తెలుపుటకు మిగుల స్వల్ప భేదములను తెలుపు కొలతలు కావలెను. చాలా రకములలో దళము వెడల్పు ననుసరించియే యుండును. కాని కొన్నిటిలో గింజ వెడల్పునకు దగిన దళముకంటె హెచ్చు దళము గలిగి యుండవచ్చును. ఉ. బంగారుతీగ. కొన్నిటిలో నీ దళము వెడల్పునకు దగినదానికంటె తక్కువగా నుండవచ్చును. ఉ. కొబ్బరిపువ్వుధాన్యము. ఇట్టి గింజలు బల్లపరుపుగ నుండును.

కొన్ని రకముల గింజలలో పొడవు వెడల్పుల ననుసరించిన ఆకార భేదములే గాక మరికొన్ని భేదములు కూడ గానవగును. కొన్నిటి ధాన్యపు గింజలందు పొట్ట రెండు వైపులకును నుబికి యుండును. ఉ. పానియస్నా. కొన్నిటిలో ఒక వైపున రెండవ వైపునకంటె హెచ్చుగా నుబికియుండును. ఉ. పున్నాసఅక్కుళ్లు. మరికొన్ని రకములలో ఒక వైపున లోనికి దిగి, రెండవ వైపు పై కుబికియుండును ఉ. తూర్పుసన్నక్కుళ్లు. కొన్నిటిలో గింజలు కొంచెము మెలితిరిగి యుండుటయు ముక్కులు వంకర

X

నుండుటయు గలదు. ఒకే వెన్నునందలి గింజలలోగూడ పై విషయములలో నొక్కొక్కప్పుడు భేదములు గానవగును. కావున కొన్ని రకముల నెందు జేర్చుటకును కష్టముగా నుండును.

వడ్లగింజల బరువు చాలవరకు వాని పరిమాణమునుబట్టి యుండును. కాని కొంతవరకు కిజ టొకపాయల దళమును బట్టియు, బియ్యపు సంఘనత్వమును బట్టియు గింజలలో మూల వెలితి యుండుటను లేకపోవుటను బట్టియు ధాన్యమునందలి తేమను బట్టియుకూడ నుండును. నూరుగింజల తూనికయు 25 గ్రెయినులు (గ్రెయిను అనగా తులమున 180 వ వంతు) గాని అంతకు తక్కువగాని తూగురకములు మిగులచిన్నవి. ఉ. కాకిరెక్కలు సోమసన్నాలు. 26-30 గ్రెయినులు తూగునవి చిన్నవనిపించుకొనును. ఉ. చిక్కిరిసన్నాలు, కిచ్చిడిసంబా, దాశరధీలు. 31-35 గ్రెయినులు తూగునవి మధ్యమములు. ఉ. మొలకొలుకులు, బలరామభోగం, సన్నపుళ్లు. 36-40 గ్రెయినులు తూగునవి ముదురనిపించుకొనును. ఉ. బోరోపాంగో, బొబ్బిలిగంటి. 41-45 గ్రెయినులు తూగునవి పెద్దవని పించుకొనును ఉ. పాలుగుమ్మసరి, నల్లఆరెలు, రసంగి. నూరుగింజలు 45 గ్రెయినుల కెక్కువ తూగునవి మిగుల పెద్దవి. ఉ. పానియన్లా, ముండ్లవరి.

4. వడ్లగింజల యితర లక్షణములు:— కొన్ని రకముల వడ్లగింజలకు తోకలు లేక ముండ్లుండును. కొన్నిటిలో నివి మిగుల కురుచగా నుండును. ఉ. కృష్ణకాటుకలు. కొన్నిటిలో పొడవుగ నుండును. ఉ. నల్లఆరెలు. కొన్నిటిలో నీ తోకలు రంగులేక గాని కొంచెము మసరగ గాని యుండును ఉ. ముండ్లవరి. కొన్నిటిలో గోధుమ వర్ణము గలిగి యుండును ఉ. ఫున్షియా. కొన్నిటిలో నెరుపుగ నుండును. ఉ. కష్ణకాటుకలు. కొన్నిటిలో బంగారు వర్ణము గలిగి యుండును. ఉ.

20 వ పటము.



బంగారుతీగలు. కొన్నిటిలో నివి నల్లగ గాని గోధుమ వర్ణములో చేరిన కలుపురంగు గలిగి గాని యుండును. ఉ. సత్తికాలు, నల్ల ఆరెలు. కొన్నిటిలో నీ తోకలు వెన్నునందలి అన్ని గింజలకును యుండును. ఉ. ముండ్లవరి. కొన్నిటిలో వెన్ను నందలి కొన గింజలకే యుండును. ఉ. [illegible]కలు.

## గింజలకు తోకలు, లేక ముండ్లుండు రకములు.

కొన్ని రకముల గింజలు చేను కోసిన వెంటనే మొలచును. ఉ. స్వర్ణాలు, గరికసన్నవరి, ఇవి కోసిన వెంటనే మొలకకట్టి చూడగా వరుసగా నూటికి 97,99 చొప్పు[illegible]ను. కొన్ని కొంతకాలము నిల్వయున్న గాని అట్లు మొలకె[illegible]చ్చుటకుసంబా. ఇది కోసిన వెంటనే

అనగా డిసెంబరు నెలలో మొలక కట్టిచూడగా నొక గింజ కూడ మొలవలేదు. జనవరిలో నూటికి 39 చొప్పునను ఫిబ్రవరిలో 91 చొప్పునను మార్చిలో 99 చొప్పునను [illegible] రకములు మొలచుచున్నవి. కోసిన పిమ్మట సుమారు 3,4 నెలలు గడువవలెను. కోసిన వెంటనే మొలచు రకములు సామాన్యముగ రెండవపంటకును అనుకూలించును.

కొన్ని రకములు వెన్ను వేసినపుడు అందలి పూవులందు సమీపముననున్న యితర రకముల పూవులందలి పుప్పొడి గాలికెగిరి పడుటచే మరికొన్ని రకముల కంటె సులభముగ సంకరమగును. ఉ. కిచ్చిడిసన్నవడ్లు, పునాసఅక్కుళ్లు. పునాస సీతామణి మొదలగు మరికొన్ని రకములిట్లు యితరలో సంకరములు కావు. అన్యోన్య సంపర్కమునకు వీలగునట్లు సాగుచేయబడిన యే రకములోనైనను సామాన్యముగ నూటికి సుమారు రెండు పూవులకంటె నెట్లు సంకరము కాదని కనిపెట్టబడెను. కాని మరుసటి సంవత్సరము ఈ రెండు గింజల నుండే పుట్టు మొక్కల నుండియే వేలకొలది గింజలేర్పడుటచే 3-4 సంవత్సరములలో నా రకమునందు కేళీలు విస్తరించిపోవును.

౮. వెన్నుయొక్క వైఖరి:— వెన్నుయొక్క పొడవు, అందలి గింజల సంఖ్య అవి యమర్పబడియుండు రీతి, వెన్ను నందలి పొల్లుగింజల సంఖ్య, మొత్తముమీద గట్టిగింజల తూనిక మొదలగు లక్షణములు చేరి వెన్నుయొక్క వైఖరిని సూచించును. ఈ లక్షణములు చాల వరకు పరిస్థితులనుబట్టి మారుచుండవచ్చును. కావున నీరక మిట్టి లక్షణములు గలదని నిర్ధారణ చేయుట కష్టము. అయినను సాధ్యమైనంత వరకు సమపరిస్థితులందు పరీక్షించగా తేలిన కొన్ని వ్యత్యాసములు క్రింద సూచింపబడును.



21 వ పటము—వెన్నుల పొడవు భేదములు.

పరీక్షింపబడిన రకములలో వెన్నయొక్క సగటు పొడవు 7.9 మొదలు 12.9 వరకు నుండెను. బొబ్బిలిగంటి మిగుల కురుచవెన్ను వేయు రకముల కుదాహరణము. హేమనసన్నాలు, మొలకొలుకులు కురుచ వెన్నులు గల రకముల కుదాహరణములు. బర్మాహలుండా, గుణుపురం సన్నాలు, మహారాజభోగం ఇవి మధ్యమపు పొడవుగల వెన్నులు గలిగి యుండు రకముల కుదాహరణములు. బలరామభోగాలు, హరశంకర్, పునాసఅక్కుళ్లు, రత్నసుడి వీని వెన్నులు పొడవు. కాకిరెక్కలు, పాని యన్నా, వీని వెన్నులు మిక్కిలి పొడవు.

పరీక్షింపబడిన ఆయా రకముల వెన్ను లందలి గింజల సగటు సంఖ్య 83 మొదలు 364 వరకు నుండెను. సామాన్యముగ వెన్ను పొడ వెక్కువగ నుండు గింజలలో నివి పలుచగ నమరి యుండును. కురుచగా నుండు వానిలో నివి చిక్కగ నమరియుండును. కాని వీని కపవాదములు లేకపోలేదు. కొన్ని రకములలో 3,4 గింజలు చేరి గుత్తులుగ నుండుటచే నట్టి వెన్నులందు గింజలు మరింత చిక్కగ నమరియుండును. ఇట్టి వరులకు గుత్తివడ్లని పేరు. వెన్ను నందలి గింజలచేరిక వెన్ను పొడవునుబట్టి యంగుళము కెన్ని గింజలుండునో లెక్కించిన యెడల సులభముగా గ్రాహ్యమగును. ఇట్లు లెక్కింపగా ఆయారకములలో అంగుళమునకు 9 గింజలు మొదలు 36 వరకుండెను. నల్లఆరెలు, సత్తికాలు, ముంగ్లవరి, గిరకసన్నవరి ఇవి మిగుల పలుచగ నమరియుండు రకముల కుదాహరణములు. బసంగి 61,* కిచ్చిడి సంబా, పాలగుమ్మసరి. ఇవి పలుచగ నుండు రకముల కుదాహరణములు. పునాసక్కుళ్లు, రసంగి 26, మహారాజభోగం ఇవి గింజలచేరిక మధ్యమముగా నుండు రకముల కుదాహరణములు. వర్షూణం, గుణుపురంసన్నాలు, మోస

* రకపు పేరుప్రక్కనుండు నిట్టి యంకెలు అందుండి యెంచిన వంగడపు సంఖ్యను దెలుపును.

పురులు, బలరామభోగం ఇవి గింజలు చిక్కగ నుండు రకముల కుదాహరణములు. నవకోటిసన్నం 3 గింజలు మిగుల నొక్కుగనుండు రకముల కుదాహరణము.

సామాన్యముగ వెన్ను నందు గింజలు చేరికగానుండు రకములలో పొల్లెక్కువగ నుండును. కాని దీనికిని అపవాదములు లేకపోలేదు. లేకర పరీక్షించిన రకములలో పొల్లుగింజలు నూటికి 4–57 వరకు నుండెను. పొల్లు గింజల పరిమాణము చాలవరకు కాలమాన పరిస్థితులపై గూడ సాధారణ పడియున్నను, రకము యొక్క స్వభావమును బట్టి కూడ నుండుననుటకు సందేహము లేదు. మహీపాలీ, సుంకిసన్నం, మోసపురులు, పాలగుమ్మసర 7 ఇవి పొల్లు మిగుల తక్కువగ నుండు రకముల కుదాహరణములు. సుణుప్రగింపసాన్నలు, బైటల్ ఫకీర్, కనకసాంబ 4, పునాసక్షుళ్ళు 3. బసంగి 61 ఇవి పొల్లు తక్కువగ నుండు రకములు. మహారాజభోగం, రత్నసుడి 9, కిచ్చిలిసంబా, బొబ్బిలిగంటి, ఇవి పొల్లు మధ్యముగ నుండు రకముల కుదాహరణములు. తూర్పుసన్నక్కుళ్లు పొల్లు హెచ్చుగ నుండు రకముల కుదాహరణము.

పంటయొక్క పరిమితి వెన్ను నందలి గట్టిగింజల బరువును బట్టియు, ఏర్పడిన నొక నిర్ణీత విస్తీర్ణమున బయలుదేరు వెన్నుల సంఖ్యను బట్టియు నుండును. కావున ఆయా రకముల వెన్ను లందలి గట్టిగింజల సగటు తూనికను తెలిసికొనుట దాని రాశికను తెలిసికొనుటకు కొంత వరకు సాధనమగును. ఒకానొక పరీక్షలో బంగారుతీగ అను రకమున వెన్ను 1 కి గల 251 గింజలలో 70 పొల్లు గింజలుపోను మిగతా గట్టిగింజలు 4.2 గ్రాములు తూగెను. రసంగి 26 వెన్ను 1 కి గల 232 గింజలలో పొల్లు

గింజలు 35 పోను మిగతా గట్టిగింజలు 85 గ్రెయినులు తూగెను. ఇట్లే ఆయా రకములందు భేదములు గానవగును.

కొన్ని రకములలో వెన్ను నందలి గింజలు సులభముగ రాలిపోవును. ఉ. గరికసన్నవరి. కొన్నిటిలో నట్లు రాలవు. ఉ. రత్నసుడి 9. సులభముగా రాలిపోవు రకములలో చేను కోయునపుడు గాని అంతకు ముందే గాని కొన్ని గింజలు రాలిపోయి నేలపాలగుటచే కొంత నష్టముండును. ఒక్కొకప్పుడు కోతకు ముందుగాని పనమీదగాని గాలిగాని వర్షమును తటస్థించినచో నీనష్టము విస్తారముగ నుండును. కాని యిట్టి రకముల నూర్పిడి సులభము. సులభముగా రాలని రకముల నూర్పిడి కష్టమగుటచే కొందరు రైతులు బాగుగ ఫలించు వానిని సైతము వదలుకొనుటగలదు.

చాల రకములలో వెన్నుయొక్క మొదలు కోటాకు నుండి బాగుగ అనగా సుమారు 4-6 అం. పైకి వచ్చును. ఉ. రత్నసుడి 9. కొన్నిటిలో నిది కోటాకు నుండి స్వల్పముగనే పైకి వచ్చును. ఉ. గుణుపుర గంపసాంబలు. కొన్నిటిలో నిది పొట్టలోనే యుండుటయు గలదు. ఉ. బొబ్బిలిగట్టి. (17 వ పటము చూడుడు) బాగుగ పైకిరాని రకములలో సామాన్యముగ పొల్లుగింజ లెక్కువగ నుండును.

6. దుబ్బుచేయు స్వభావము, దుబ్బుయొక్క వైఖరి:- దుబ్బుచేయుట అనగా పిల్కలను హెచ్చుగా పెట్టుట. ఇది నేలయొక్క సత్తువ, నాటు కాలము, దూరము, నారుయొక్క స్థితి మొదలగు పెక్కు స్థితిగతులపై నాధారపడి యుండును. కాని సమ పరిస్థితుల యందు పరీక్షించినపుడు సైతము కొన్ని రకములకు మరికొన్నిటి కంటె హెచ్చుగదుబ్బుచేయు స్వభావము గానవగును. హెచ్చుగ దుబ్బుచేయు రక

12 వ పటము



ఎడమ—బాగుగ దుబ్బుచేయని రకము—
కుడి—బాగుగ దుబ్బుచేయు రకము.

ములు ఉదాహరణములు కిచ్చిడిసంబా, మొలకొలకులు. దుబ్బు చేయుటలో మధ్యమముగ నుండు రకముల కుదాహరణములు మహిపాళి,

కోణామణి, పునాసకోణామణి. తక్కువగ దుబ్బుచేయు రకముల ఉదాహరణములు కొబ్బెరపువ్వుధాన్యము, బొబ్బిలిగంటి.

దుబ్బునందలి పిలకలు కొన్ని రకములలో చీపురుకట్టలోని పుల్లల వలె మిగుల దగ్గరగ చేరియుండును. ఉ. ఆలురిగడా. కొన్నిటిలో నివి

23 వ పటము



ఎడమ—పిలకలు విడియున్న దుబ్బు. కుడి—పిలకలు కట్టవలె చేరికగానున్న దుబ్బు.

ప్రక్కలకు వాలి యుండును. ఉ. గరికసన్నవరి. కొన్ని రకములు యీ విషయమున మధ్యమముగ నుండును. ఈ భేదము కొంత వరకు లోతుగ నాటుట పైపైన నాటుట వలన గూడ గలుగవచ్చును. కాని రకముల స్వభావమునందే యీ భేదము లేకపోలేదు. పిల్కలు దగ్గరగ లేయుండు రకముల చేను సులభముగ పడిపోవును.

దుబ్బునకు యెత్తు కూడ చాలవరకు పరిస్థితులనుబట్టి యుండును. అయినను పలు పరిస్థితు లందు పరీక్షించినచో నీ విషయమున గూడ ఆయా రకములందు కొన్ని తారతమ్యములు లేకపోలేదు. లేకరి యొక సంవత్సరము సమ పరిస్థితులందు పరీక్షించిన రకములలో 39.5 అంగుళములు మొదలు 71.3 అంగుళముల వర కెదిగిన రకము లుండెను. సామాన్యముగ త్వరగా ఫలించు రకములు కురుచగ నెదుగును. ఉ. పత్తికాలు, గుత్తాలు. పెద్దవరులు యెత్తుగా నెదుగును. ఉ. మహారాజభోగం. ఇందులకు కొన్ని యపవాదములు కూడ గలవు నవకోటిసన్నం 3 కంటె రత్నసూడి 7 త్వరగా పండునదైనను రెండవదే యెత్తుగ నెదుగును.

మిగుల నెత్తుగ నెదుగు రకములు సామాన్యముగ గాలి వీచినప్పుడు గాని, వెన్ను బరువుచే గాని సులభముగ పడిపోవును. కొన్ని రకములలో మరి కొన్నిటితో సమానపు యెత్తు మాత్రమే యెదిగినను వాని కాండము గట్టిగ నుండుటచే నంత సులువుగ పడిపోవు. గరికసన్నవరియు, పునాసక్కుళ్లును సులభముగ పడిపోవు రకములకు నుదాహరణములు. కిచ్చిడిసంబా, చిక్కిరిసన్నాలు, పానియస్నా ఇవి సులువుగ పడిపోని రకముల కుదాహరణములు.

6. ఆకు వెడల్పు వగైరాలు: — ఆకు నందలి తొడిమ యొక్కయు రేకు యొక్కయు పొడవు కూడ చాల వరకు దుబ్బు పెరుగుదలను బట్టియే యుండును. కాని దుబ్బు యెత్తు సమముగ నున్నను ఆయా రకముల యాకుల తొడిమ, రేకు వీని పొడవునందు భేదములు గానవగును. దుబ్బుయొక్క యెత్తును బట్టి చూచినచో తొడిమ మిగుల కురుచ యనిపించుకొను రకముల కుదాహరణములు కాకిరెక్కలు, గరికసన్నవరి 1. పొడవనిపించుకొనునవి సత్తిగాలు, సన్నక్కుళ్లు, కనకసాంపు. మధ్యముగా నుండు వాని కుదాహరణములు బసంగి 61, కృష్ణకాటుకలు, కిచ్చిడి సంబా.

ఇట్లే రేకు పొడవు నకును దుబ్బు యెత్తునకును గల పరిమాణమున భేదము లుండును. రేకు మిగుల కురుచ యనిపించుకొను రకముల కుదాహరణములు వంకెలు, రత్నచూడి 9. మధ్యమముగ నుండు రకముల కుదాహరణములు కో. 1, బలరామభోగం, మహారాజభోగం, రేకు మిగుల పొడవనిపించుకొను రకముల కుదాహరణము బొబ్బిలిగంటి.

రేకు వెడల్పు సామాన్యముగ దాని పొడవు ననుసరించి యుండును. కాని పొడవునకును వెడల్పునకును పరిమాణమునుబట్టి చూచినచో భేదములు గానవగును. ఈ పరిమాణము తక్కువగ గల రకముల కుదాహరణములు, నల్లఆరెలు, కిచ్చిడిసంబా, మొలకొలుకులు. మధ్యమముగా నుండు రకముల కుదాహరణములు హేమసన్నాలు, గుమ్మసరి, గుణుపురసన్నాలు. రేకు వెడల్పు పరిమాణము హెచ్చుగా నుండు రకముల కుదాహరణములు పునాసకోణామణి 2, కొబ్బెపువ్వుధాన్యము.

కొన్ని రకములలో కోటాకు వెన్నుచివరను మించి చాల పొడవుగ పెరుగును. ఉ. నవకోటిసన్నాలు 3, మహారాజభోగం, బయ్యాహుండా. కొన్నిటిలో నీ కోటాకు చివర వెన్నుచివర కంటె దిగువనే యుండును. ఉ. మోసపురులు, కాకిరెక్కలు. (17 వ పటము చూడుడు)

## 8. ఆకులు, మొదలగు వాని యందలి రంగు :—

సామాన్యముగ వరియాకులు ఆకుపచ్చగ నుండును. కొన్ని రకములలో ఆకు లన్నియు నూదారంగు గలిగి యుండుట గలదు. ఉ. పుట్టువరి ఆకులు పసరువర్ణము గలిగియున్న కొన్ని రకములలో కూడ మొక్క యందలి వివిధ భాగములలో కొద్ది గొప్ప ఊదా రంగుండుట గలదు. 24 ఈ రంగుండు ముఖ్య భాగములు తొడిమ వెలుపల, తొడిమ లోపల, కాండము, తొడిమకును రేకుకును సంధి (కటిప్రదేశము), కటిప్రదేశ మందుండు మీసములవంటి యంగములు, అచట నుండి లోపలి భాగమున పైకి కెదిగియుండు మించు, ఆకుల యంచులు, అండాశయము పై నుండు కీలము, లోపలి తుషముల కొనలు, వాని పై భాగములు కొన భాగములు, వాని ప్రక్కలు, వెలుపలి తుషములును. లేకరి పరీక్షించిన రకములలో నీ యూదారంగు పైని పేర్కొనబడిన వానిలో నొకటి మొదలు పన్నెండు ప్రదేశము లందు వరకును గల రకములుండెను. బలరామభోగం, బయ్యాహుండా, మహిపాళి. కోణామణి, గుమ్మసరి, మహారాజభోగం, గుజుపురంసన్నం ఇవి దుబ్బు యొక్క యే భాగము నందును ఊదారంగు కనబడని రకముల కుదాహరణములు. కొన్ని కొన్ని భాగము నందూదారంగు గలవాని కుదాహరణములు మోసపురులు, గరికసన్నవరి, రసంగి, కృష్ణకాటుకలు, నవకోటి సన్నాలు.

కొన్నిరకముల కాండమునందు ఒకవిధమగు బంగారు వర్ణముండును. ఉ. గిత్నసుడి, హేమసన్నాలు. ధాన్యము బంగారు వర్ణము గలిగి యుండు రకములలో కాండము కూడ నిట్టు బంగారు వర్ణము గలిగి యుండును. ఇట్టి రకములలో బియ్యమెప్పుడును యెఱ్ఱగ నుండవు. ఇట్టి బంగారు వర్ణము ఊదా రంగెందును లేని రకములలోను (ఉ. గిత్నసుడి 9) కొన్ని భాగము లందూదారంగుగల రకములలోను (ఉ. హరిశంకర్) కూడ నుండుట గలదు.

11. వేళ్ల వ్యాప్తి:—ఈ విషయమును పరీక్షించి ఆయా రకము లందు భేదములను నిర్ణయించుట కష్టము అయినను ఆయా రకముల వేళ్లవ్యాప్తి యందు భేదములు లేకపోలేదు. సామాన్యముగ త్వరలో పండు రకముల కంటె ఆలస్యముగ ఫలించు రకముల వేళ్లు విరివిగ వ్యాపించునని చెప్పదగును. వేళ్లవ్యాప్తి నేలయొక్క స్వభావమును బట్టియు సత్తువను బట్టియు దుబ్బు పెరుగుటకు గల యవకాశమును బట్టియు కూడ నుండును. రెండడుగుల దూరమున పెరుగుచుండిన కొన్ని దుబ్బుల వేళ్లు 2 అ. దూరమునకును లోతునకును వ్యాపించెను. సామాన్యపు చేలలో సుమారు 1 అడుగు దూరమునకును 9 అం. లోతునకును వ్యాపించును. వేళ్లవ్యాప్తియందే గాక వాని విస్తారత యందును భేదము లుండవచ్చును. కోణామణి, పునాసకుఱ్ఱళ్లు ఇవి బాగుగ నెదిగి హెచ్చుపంట నిచ్చు రకములయినను వీని వేళ్ల మొత్తపుతూనిక కనకసాంబ, నవకోటి సన్నాల వీని వేళ్ల తూనిక కంటె తక్కువగ నుండెను. రసంగి తక్కువ వేళ్లు పోసినను హెచ్చు పంటనిచ్చు రకముల కుదాహరణము. తూర్పుసన్న కుఱ్ఱళ్లు హెచ్చు వేళ్లు పోసి తక్కువ పంట నిచ్చు రకముల కుదాహరణము. విస్తారముగ వేరుపోయు రకములలో సామాన్యముగ గడ్డ

హెచ్చుగ నగును. మరియు నట్టి రకముల రాలికెను బట్టి చూచినచో నవి భూమియొక్క సారము ననవసరముగా దీసివేయునని చెప్పవచ్చును.

10. ఫలించుటకు పట్టుకాలము[26]: — వ్యవసాయదారుడు రకముల నెన్నుకొనుటలో గమనించు ముఖ్య లక్షణములలో నిది యొకటి. ఏజిల్లా నొకే కాలమున విత్తినయెడల నే రకమైనను వెన్ను వేసి గింజలు ముదురుటకు పట్టు కాలము, కొంచె మించు మించు నిర్ణీతముగా నుండును. జూన్ 18 వ తేదీని విత్తి జూన్ నెలాఖరున నాటి చామర్లకోట వ్యవసాయస్థానమున చాల రకములను పరీక్షింపగా నందు విత్తినది మొదలు ఫలించు వరకు 3½ నెలలు మొదలు 5½ నెలల వరకు పట్టిన రకములు తేలెను. ఈ వ్యత్యాసము చాల వరకు వెన్ను వేయుటకు పట్టుకాలము నందే యుండును. ఈ ప్రాంతములందు జూన్ నడుమ నారుపోసి ఆ కాలమున నాటినప్పుడు 130 దినములలోగాని అంతకు తక్కువ కాలములోగాని ఫలించు రకములు మిక్కిలి పునాసవరులని యనవచ్చును. ఉ. వ్యాగ్రాలు, సత్తికాలు, హేమసన్నాలు, పునాస, అట్రిగడా. 131–145 దినములలో ఫలించునవి పునాస వరులుగ పరిగణింప దగును. ఉ. బసంగి, గరికసన్నవరి, రసంగి, సుంకిసన్నాలు. 146–160 దినములలో ఫలించునవి మధ్యమములుగ నెంచదగును. ఉ. బొబ్బిలిగంటి, పాలగుమ్మసరి, పునాసకొలమణి, బోరోపాంకో, పునాసఅక్కుళ్లు, కిచ్చిడిసంబా (G. E. B 24). 165–175 దినములలో ఫలించునవి పెద్దవరులుగ పరిగణింప దగును. ఉ. గుంటుపురం సన్నాలు, బర్మ్యాహుండా, కొణామణి, మహిపాలి, కృష్ణకాటుకలు, నవకోటిసన్నాలు, రత్నసడి. 175 దినములకు వెనుక పండునవి మిగుల నాలస్యముగ ఫలించు తెంగతిగ పరిగణింపదగును. ఉ. పీసాణం, మొలకొలకులు.

ఒకే సమయమున సమ పరిస్థితులందు విత్తి నాటినప్పు డాయా రకములు ఫలించుటకు పట్టు కాలము కొంచె మించుమించు నిర్ణీతముగానున్న, విత్తు లేక

నాటు కాలములందు భేదములున్నచో ఫలించుటకు పట్టు కాలమునందును వ్యత్యాసము గలుగుచుండును. ఒకానొక ప్రయోగమున జూన్ 12 వ తేదీని విత్తి జూలై 8 వ తేదీని నాటిన నొక పెద్దవరి రకము 163 దినములలో ఫలింపగా మే 24 వ తేదీని విత్తి జూలై 8 వ తేదీనే నాటిన యదే రకము ఫలించుటకు 181 దినములు పట్టెను. తేలిక వరులలో నీ వ్యత్యాసము మిగుల తక్కువగ నుండును. జూన్ 11 వ తేదీని విత్తి జూలై 26 వ తేదీన నాటిన బసంగివరి అక్టోబరు 27 వ తేదీని కోతకు వచ్చెను. జూన్ 22 వ తేదీని విత్తి జూలై 25 వ తేదీని నాటిన బసంగివరి నవంబరు 5 వ తేదీని కోతకు వచ్చెను. మొదటిది ఫలించుటకు 138 దినములును, రెండవది ఫలించుటకు 136 దినములును పట్టెను. తేలిక వరుల నొకేసారి విత్తినను నాటు కాలమున వ్యత్యాసమున్న యెడల ఫలించుటకు పట్టు కాలము నందును వ్యత్యాస ముండును. కాని పెదవరులలో నిట్టి వ్యత్యాస మంతగా నుండదు.

నేల యొక్క సత్తువను బట్టి కూడ వరులు ఫలించుటకు పట్టు కాలము స్వల్పముగా మారవచ్చును. నీరసముగ నున్న నేలలలో పైరు కొంచెము (4 దినముల వరకు) ఆలస్యముగ వెన్ను వేయును కాని ఒక్కొకప్పుడు అతిసత్తువ వలనగూడ వెన్ను వేయుట ఆలస్య మగుటయు గలదు. ఈ భేదము కొంతవరకు రకమును బట్టియు నుండును.

వెలుతురు గూడ ఫలించు కాలమున స్వల్ప వ్యత్యాసమును గలిగింప వచ్చును. మడి యంచుల నున్న దుబ్బులు సామాన్యముగ ముందీనును. చెట్ల నీడను పెరుగునవి ఆలస్యముగ నీనును.

ఆయా ప్రదేశము లందలి శీతోష్ణాది స్థితిగతులు ఆయా రకములు ఫలించుటకు పట్టు కాలమున చాల వ్యత్యాసములను గలిగించును. ఉత్తర సర్కారులలో 5½-6 నెలలలో ఫలించు నొక వరిరకము దక్షిణార్కాడు జిల్లాలోని పాలూరు క్షేత్రమున 4-4½ నెలలలోనే ఫలించెను. కిచ్చిడి సాంబా కోయంబత్తూరులో కంటె ఉత్తర సర్కారులలో ఆలస్యముగ ఫలించుచున్నది.

ఒక్కొక్కప్పుడు కొన్ని రకములు వాని పూత కాలము దాటించి నాటిన యెడల నది మరుచటి సంవత్సరము పూతకాలము వరకు పెరుగుచునే యుండును. సైదాపేట క్షేత్రమున నిట్లొకసారి 4-4½ నెలలలో ఫలించు నొకవరిని ఆలస్యముగ నాటగా నది ఫలించుటకు సుమారు 10½ నెలలు పట్టెను. సింహాళమున జరిగిన యొక ప్రయోగమున సామాన్యముగ వరి సాగుచేయు ఆగస్టు-సెప్టెంబరు నెలలలో విత్తిన సుమారు 6½ నెలలలో ఫలించు వరిరకము డిసెంబరు మొదలు ఏప్రిల్ వరకు విత్తి పరీక్షించగా నాసస్యము ఫలించుటకు 11 మొదలు 13 నెలల వరకు పట్టుటయు, పంట తగ్గుటయు తటస్థించెను.[27].

చే నీనిన వెనుక వెన్నులు ముదిరి యది కోతకు వచ్చుటకు పట్టు కాలమున నాయా రకములలో వ్యత్యాస మంతగా నుండదు. సామాన్యముగ స్వచ్ఛమైన వంగడపు వరిని సమమైన నేలలో నేకకాలమున నాటిన యెడల దుబ్బు లన్నిటి నుండియు కోటివెన్నులు వెలువడుట సుమారు 3-5 దినములలో ముగియును. ఒక వెన్ను నందలి పూవులన్నియు విడుచుటకు సుమారు 5-8 దినములు పట్టును. ఒక దుబ్బులోని వెన్నులన్నియు నీనుటకు సుమారు 3-7 దినములు పట్టును. విస్తారముగ దుబ్బు చేయు రకములలో హెచ్చు కాలము పట్టుటయును గలదు. పూవు విడి

చిన పిమ్మట గింజము దూరుటకు సుమారు 15-19 దినములు పట్టును. క్షేత్రము మీద ఉత్తరసర్కారులలో చేనియందలి కోటి వెన్నులు సగము ఈను నప్పటినుండి లెక్క వేసిన యెడల వెన్నులు ముదిరి కోత గోయుటకు సుమారు 28-32 దినములు పట్టును. తేలిక వరుల కంటె బరువు వరులు కొంచె మెక్కువ కాలము తీసికొనును.

సారువా (అనగా కొలకరలో ప్రారంభించు) పంటకు నీరు ముందుగా నంది వెనుకగా నీరు తక్కువ పడు ప్రదేశము లందు మిక్కిలి తేలిక వరులు గాని, తేలిక వరులు గాని అనుకూలించును. మరియు పెద్ద వరులు నాటినచో నేల మిక్కిలి సారవంత మగుటచే చేను మిగుల నెదిగి పడి పోవునను భయమున్న చోట్లకూడ తేలిక వరు లుపయోగించుదురు. మొదటి పంటను గోసిన తరువాత వెంటనే మరియొక పెద్ద పంటను పెట్టు ఆచారము గల చోట్ల గూడ మొదటి పంటకు తేలిక వరు లనుకూలించును. మరియు సామాన్యముగ మొదట తేలిక వరులు పెట్టు నేలలలో రెండవ (దాళువా) పంట బాగుగా ఫలించును. ఇట్లే పెసర, మినుము మొదలగు పయిర దినుసులను పునాసవరులు పెట్టిన నేలలలోనే బాగుగా ఫలించును. చెరుకుతోటలు గాని పయిర నూవు గాని పెట్టదలచు నేలలలో పునాసవరులు పెట్టినచో వీనిని గోసికొని నేలను త్వరలో తయారుచేయ వీలగును. వేసవిలో నీరు సామాన్యముగ తక్కువగ నుండుటచే దాళువా పంట కెపుడును తేలిక వరులనే పెట్టుట యాచారము.

తేలిక వరులను సారువా పంటకు పెట్టినచో నవి వర్షకాలమున కోతకు వచ్చుట ఒక ముఖ్యమైన చిక్కు. మరియు వర్షములు ముందుగా కురియక పోవుటచే గాని ముందుగా నీరందని యెడల గాని వాని నాలస్యముగ నాటవలసి వచ్చుట వలన అవి పెరుగుట కుండు కాలము తగ్గిపోయి

పంట అల్పముగ నుండును. సామాన్యముగా త్వరలో ఫలించు రకములు బీదనేలల కనుకూలింపవు. ముందుగ ఫలించు రకములను ఎచటనైన కొద్ది విస్తీర్ణమున నాటుచో వాని వెన్నులకు పక్షుల బాధ హెచ్చుగనుండును.

పెద్దవరులు నీరు తగినంత లభించు చోట్లకును నేల యతిసారవంతము గాని చోట్లకును అనుకూలించును. చల్లిక గాని నాటుట గాని ఆలస్యము చేయవలసి వచ్చు చోట్లకు కూడ పెద్దవరు లనుకూలించును. త్వరలో నీరు వడిసి కోతకు వీలియ్యని ప్రదేశము లందును పెద్దవరులు పెట్టుట యవసరము.

11. ఆయా స్థితిగతుల కనుకూలత; ప్రతికూల పరిస్థితులకు తాళుట:— ఈ విషయము లందు కూడ ఆయా రకముల స్వభావమునందు భేదములు గలవు. వరి సామాన్యముగ నీటిలో బెరుగు సస్యమైనను. కొన్ని రకములు నీరు పెట్ట నవసరము లేకయే వర్షాధారమున పెరుగగలుచున్నవి. ఉ. బుడమ, జిలమ, వెలవడము. వీనిని మెట్టవరులందురు. వీనిలో బుడమ జిలమ కంటెను, జిలమ వెలవడము కంటెను ఎక్కువ తేమతో పెరుగును. సామాన్యముగ నీరుపెట్టి సాగుచేయు రకములు దంపవరు లనబడును. వరి రకములలో చాల భాగము ఈ తరగతిలోనే చేరును. వీనిలో గూడ కొన్ని స్వల్పపు నీటిలో బాగుగ ఫలించును. ఉ. రసంగి. కొన్ని విస్తారముగ నీరు నిలుచుచోట్లనే బాగుగ ఫలించును. ఉ. నీటికాసర, హరిశంకర్. ఇట్టివి కొంత వరకు నీటి ముంపునకు గూడ ఆగును. కొన్ని రకములు జిగురు నేలలందు బాగుగ ఫలించును. ఉ. గుమ్మసరి. మరికొన్ని గరుప నేలల కనుకూలించును. ఉ. రత్నసూడి. ఇట్లే కొన్ని చౌటినేల లందుకూడ ఇతర రకములకంటె బాగుగ ఫలించును. ఉ. పచ్చఅక్కుళ్లు. చాలరకముల వరులు లేతగ(ఆలస్యము)గ నాటిన బాగుగ

ఫలింపవు. కొన్ని యిట్లు ఆలస్యముగ నాటినను కొంత వరకు పండును. ఉ. ఈశ్వరకోరా. కొన్ని రకములు సారువా దాళువా పంటలకు రెంటికిని అనుకూలించును. ఉ. గరికసన్నవరి, కాశీపిచోడి. కొన్ని పునాసవరు లయినను అట్లనుకూలింపవు. ఉ. బసంగి.

కొన్ని రకములకు మరికొన్నిటి కంటె చీడలు, తెగుళ్లు హెచ్చుగా పట్టును. సామాన్యముగా రసంగి చేల కివి యంతగా పట్టవు. రసంగి దుబ్బులలో పుట్టిన పిల్కలలో నితర రకములలో పుట్టిన వాని యందు కంటె హెచ్చు భాగము చివర వరకు పెరిగి వెన్ను వేయునని కనిపెట్ట బడెను. ఈ రకమున మంచి పరిస్థితులలో నూటికి నాలు పిల్కల కంటె హెచ్చుగా రద్దు కాలేదు. మరికొన్ని రకములలో నూటికి 16 వరకు రద్దయ్యెను. ప్రతికూల పరిస్థితులలో కొన్ని రకము లందు నూటికి 50 పిల్కల వరకు రద్దైన సంవత్సరము లుండెను. ఇటీవల వరిచేలకు పట్టు చున్న మొదలు చీకు (Footrot) కిచ్చిడిసంబాకు మిగుల తక్కువగ పట్టు ననియు, గరికసన్నవరికి హెచ్చుగ బట్టుననియు కనిపెట్టబడెను. ఉంచు తిరి లేక పీకపురుగు పట్టుటలోను ఇతర చీడలు పట్టుటలోను గూడ ఆయా రకములందు కొంత వరకు తారతమ్యములు గలవు.

12. ధాన్యపు రాలిక, గడ్డియగుట :—ఏదైన నొక నిర్ణీత విస్తీర్ణమున (సామాన్యముగ 1 యెకరమున) పండు ధాన్యపు పరిమితి లేక రాలిక చాల వరకు స్థితిగతుల ననుసరించి యుండును. కాని రకపు స్వభావము కూడ రాలికకు తోడ్పడు ననుటకు సందేహము లేదు. ఇదివరలో చర్చింపబడిన కొన్ని మంచి లక్షణముల ఫలమే రాలిక. అందు దుబ్బుచేయుట. వెన్నునందలి గట్టిగింజల బరువు ఇవి రెండును ముఖ్యములు ఈ రెండు లక్షణములును అనుకూలముగ నుండు రకములె సామాన్యముగ

మరొకటి రాలిక గలవిగ నుండును. రాలిక హెచ్చుగా నుండుటకు దుబ్బు చేయుటయేగాక అందు వెన్నువేయు పిల్కలసంఖ్య కూడ హెచ్చుగ నుండ వలయును. సామాన్యముగ హెచ్చుగ దుబ్బుచేయు రకముల వెన్నులు చిన్న విగ నుండును. వెన్నులు పెద్దవిగ నుండు రకములు అంతగా దుబ్బుచేయవు. ఈ రెండు లక్షణములకును సాధ్యమయినంత చేరిక గల రకములు గాని ఒక లక్షణమున వెనుకబడినను రెండవ లక్షణము హెచ్చు అనుకూలముగ గల రకములు గాని మంచి రాలిక గలిగియుండును. ఆయా ప్రాంతము లందు సాగు చేయబడుచున్న రకముల రాలికను సామాన్యముగ వ్యవసాయదారులు తమ యనుభవము వలన తెలిసికొందురు. కాని ఒకొక్కప్పుడు పొరపాటున కవకాశము గలదు. క్రొత్త వంగడముల మంచి చెడ్డలను నిర్ణయించుటకు ప్రభుత్వ వ్యవసాయశాఖవారు రైతుల పొలములందే అనేకములగు "తణిఖీమళ్లను" (Trial plots) ఏర్పరచుచున్నారు గనుక రైతులు వీని ఫలితమును బట్టి మంచి చెడ్డలను గ్రహింపవచ్చును.

గడ్డి యనుట గూడ చాల వరకు పరిస్థితులపై నాధారపడి యున్నను నాయా రకములలో నీవిషయమున గూడ భేదములుగలవు. సామాన్యముగ పునాస రకములు తక్కువ గడ్డి నిచ్చును. పెద్ద వరులు హెచ్చు గడ్డి నిచ్చును. కొన్ని రకములు తక్కువ గడ్డి నిచ్చినను హెచ్చు ధాన్యము నిచ్చును. ఒకానొక పరీక్షలో రసంగి 100 పౌనుల ధాన్యమునకు 94 పౌనులగడ్డినే యిచ్చెను. పునాస అక్కుళ్లు 112 పౌనుల గడ్డి నిచ్చెను. కిచ్చిడిసంబా 119 పౌనులును, తూర్పుపన్నక్కుళ్లు 143 పౌనులును యిచ్చెను. సామాన్యముగ గరువనేలలలో గడ్డి తక్కువ యయినను ధాన్యపు రాలికి హెచ్చుగ నుండును. బంకనేలలలో గడ్డికి తగిన రాలిక యుండదు.

13. ధాన్యపు బరువు, బియ్యపు బరువు, బియ్యపు దిగుబడి[28]:—— ఆయా రకముల ధాన్యమును బియ్యమును ఒక్కొక కుంచము కొలచి తూచిన యెడల నీ తూనికలో కొంత వ్యత్యాసము గాన నగును. కాని యిట్లు పరీక్షించుటకు ముందు ధాన్యమును బాగుగ నెండించి యెండుటలో వ్యత్యాసము లేకుండ చూడవలెను. ధాన్యపు తూనిక యందలి వ్యత్యాసములు బియ్యపు బరువును బట్టియు, ఊకపొరల దళ మును బట్టియు, గింజల యాకారమును బట్టియు నుండును. గుండ్రని గింజలు పొడవుగను సన్నముగను నుండువాని కంటె కుంచములో బాగుగ సర్దుకొని హెచ్చు తూనిక నిచ్చును. లేకరి పరీక్షించిన రకములలో 4 సేర్ల శీలుకుంచమునకు 98 ఔన్సులు మొదలు 115 ఔన్సుల వరకు తూగిన రకము లుండెను. బంగారుతీగెలు మిగుల తక్కువగ తూగెను. బుడమ లెక్కువగ తూగెను. ఈ తూనిక కొంత వరకు నేల యొక్క స్వభావము నీటి వసతి మొదలగు స్థితిగతులను బట్టికూడ యుండును.

బియ్యపు తూనిక కుంచమునకు 142 ఔన్సులు మొదలు 152 ఔన్సుల వరకు నుండెను. ఇందును బంగారుతీగె మిగుల తక్కువగ తూగెను. కేసరి మిగుల హెచ్చు తూగెను బియ్యపు దిగు బడిలో గూడ నాయా రకములందు కొంత వ్యత్యాస ముండును. లేకరి పరీక్షించిన రకములలో తూకమును బట్టి దంపుడు బియ్యపు దిగుబడి నూటికి 56.24 మొదలు 74.65 వర కుండెను పెట్టపరంగి మిగుల తక్కువ దిగుబడి నిచ్చెను. పొదుపాభోగం, సముద్రివల్లి యివి మిగుల హెచ్చు దిగుబడి నిచ్చెను. కొల్తనుబట్టి చూచిన యెడల దిగుబడి ఆయా రకములలో నూటికి 43.60 మొదలు 54.95 వర కుండెను. బియ్యపు దిగుబడి కొంతవరకు కాలమాన పరిస్థితిని బట్టి కూడ యుండును.

చేబియ్యపు(కర్ర తిరుగలితో పైపొట్టు మాత్రమే తీసిన బియ్యపు) దిగుబడి కొలతకు నూటికి 55 మొదలు 61 వరకును, తూనికను బట్టి 65 మొదలు 76½ వరకును ఉండునట్లు తేలెను.[19]

14. బియ్యపు సంఘట్టనము, ఆహారయోగ్యత[20]:— ఈ విషయము లందు కూడ ఆయా రకము లందు కొంత వ్యత్యాసము గలదు. కొంతవరకీ భేదము పరిస్థితులను బట్టి కూడ యుండవచ్చును. ఇంతవరకు లేకరికి లభించిన పరీక్షాఫలితములను బట్టి ఆయా రకములలో

| | | | | | |
|---|---|---|---|---|---|
| తేమ | నూటికి | 8.70 | మొదలు | 12.57 | వరకును |
| బూడిద | ,, | 0.69 | ,, | 1.35 | ,, |
| మాంసకృత్తులు | ,, | 5.61 | ,, | 11.61 | ,, |
| నారపదార్థము | ,, | 0.10 | ,, | 0.60 | ,, |
| చమురు | ,, | 0.45 | ,, | 2 24 | ,, |
| కర్బనోదజనితములు | ,, | 74.39 | ,, | 82.15 | ,, |

నుండెను. 43 రకములలో సగటున తేమ నూటికి 10.72 ను, బూడిద నూటికి 0,99 ను, మాంసకృత్తులు నూటికి 7.59 ను, నారపదార్థము నూటికి 0.33 ను, చమురు నూటికి 1.00 ను, కర్బనోదజనితములు నూటికి 79.35 ను ఉండెను. మాంసకృత్తులు వెలవడం అను మెట్ట ధాన్యమున మిగుల తక్కువగను పూంబాళె అను దక్షిణాది రకపు ధాన్యమున హెచ్చుగను నుండెను. చమురు పూంబాళెలో మిగుల తక్కువగను స్వర్ణాలలో మిగుల నెక్కువగను నుండెను. ఖనిజములు వెలవడములో మిగుల తక్కువగను స్వర్ణాలలో నెక్కువగను నుండెను.

ఆయా రకముల బియ్యపు ఆహారయోగ్యత వాని సంఘట్టనముపై చాలవర కాధారపడి యుండవచ్చును. ఈవిషయమై యింకను తగిన పరిశోధన

పెంచిన చేలలో ధాన్యమేకాక గడ్డియు హెచ్చుగనగును. పట్టణములలో గడ్డి వెలయు హెచ్చుగ నుండుటచే అందువలన గూడ చాల యాదాయము వచ్చును. ఈయెరువు వేసిన చేలలో రెండవపంటయు బాగుగ ఫలించును. కావున నితర ప్రదేశములందు కూడ నీ యెరువును వృధాచేయకుండ నుపయోగించుట లాభకరముగ నుండును.

సాగునకగు వ్యయమునందు ఈ పద్ధతికిని, మెట్ట సేవ్యమునకును అంతగా భేదముండదు. కాని మెట్ట వరుల కంటె నాలస్యముగ పండు రకములనే యీ పద్ధతిని సాగు చేయుట చేతను, నీరు కట్టుట చేతను, సామాన్యముగ పంట అంతకంటె హెచ్చుగ నుండును. కాని నారు పోసి నాటిన చేసంత వాలిక యీ పద్ధతిని సాగుచేసిన చేని కుండదు.

---

## 10. దంపవరులకు నేలను సిద్ధముచేయుట.

దంపవరులను పదమే వానికి నేలను సిద్ధముచేయు విధానమును సూచించు చున్నది. దంప సేవ్యమున మళ్లలో నీరుపెట్టి కొంత నీరుండగనే దున్ని యుకు సేర్పడునట్లు చేయబడును. ఇట్లు నీ రుండగ దున్నుటకు దమ్ముచేయుట యని పేరు.

దంప నేలలందు నీరుకట్టి నిలుపవలసి యుండుటచే వానికి సుమారొక యడుగునకు దక్కువగాని యెత్తుగల గట్లచే చదునైన మళ్లుగా విభజింపవలెను. మళ్ల కొలతయు ఆకారమును, నేల యొక్క వాటమును బట్టి యుండును. సామాన్యముగ మళ్లు $\frac{1}{4}$ యెకరమునకు దక్కువగ నుండుట యనుకూలము కాదు. నీరంతటను సమముగ నిలచునటు ఏకమట్టముగ చేయునెడల మళ్లెంత పెద్దవిగనున్న నంత మంచిది. బంజరు నేలలను మెట్ట నేలలను వరకట్టి దంప మళ్లుగా జేయు విధానము 4 వ యనుబంధమున వివరింపబడును.

మళ్ళలో నీరు కట్టక ముందే వానిలో వేయదగిన పశువుల యెరువు, పెంట, పాటిమన్ను, మొదలగు స్థూలమగు నెరువులను తోలి యంతటను సమముగ జల్లవలెను.

దమ్ము ప్రారంభించుటకు కొన్ని జాములు ముందే మళ్ళకు నీరు కట్టవలెను. దమ్ము చేయు లోతువరకైనను నేల ముఖ్యముగా బంక నేల నానుటకు కొంత కాలము పట్టును. మరియు నీరు తక్కువగ నున్నపుడు దమ్ము సాగినంత త్వరితముగ మళ్లు తడియక పోవచ్చును. దమ్ము చేయుటకు సామాన్యముగ మడి యంతటను 1-1½ అంగుళములునీరు నిలచిన చాలును. లోతుగ నీరు నిలచిన మళ్ళలో దమ్ము బాగుగ కాదు.

దమ్ము చేయుటకు చాల ముందుగా నీరు కట్టుటయు మంచిది కాదు. ఇట్లు కట్టినచో నేలయొక్క గుల్లదనము పోయి దమ్ము కష్టసాధ్యమగును. మరియు జిగురునేలలు మిగుల లోతువరకు నాని పశువులు దిగబడును. ఒకవేళ నేకారణము వలననైన ముందు మళ్ళలో నీరు పడునెడల దమ్ము చేసి నాటు వరకు నీరుకట్టుచు మళ్లారిపోకుండ జూడవలెను. నీరు కట్టినపిమ్మట మళ్లారి

పోయిన యెడల నేలలోని సేంద్రియ పదార్థమునుండి నత్రితోత్పాదనము ప్రారంభమయి మరల నీరు కట్టినపుడా నత్రితములు వడిసిపోవును; లేక విధ్వంసమైపోవును.

24 వ పటము



దమ్ము చేయుట

సామాన్యముగ వరి మళ్లను మూడుసార్లు దమ్ము చేసిన చాలును. కొన్ని గట్టి నేలలలోను బీటి నేలల లోను నాల్గవసారి దమ్ముచేయుట యావసరము కావచ్చును. కొన్ని గుల్ల నేలలకు రెండుసార్లు దమ్మే చాలును. ఒకేసారి దమ్ముచేసి గాని, దమ్ము చేయకయే గాని పశువులచే నొక సారి తొక్కించి గాని, అదియు జేయకయే గాని అచ్చు టచ్చట అవసరమగుచో పారలతో గడ్డి గాదములను కెక్కలించి నాటదగినంత గుల్ల నేల లక్కడక్కడ గలవు.

కొన్ని చోట్ల మడి యంతటిని పారలతో కెక్కలించి నాటుటయు గలదు.

సామాన్యముగ నారు నాటు కాలము వరకును వర్షములు కురియని సంవత్సరములలో దమ్ము సులభముగ నగును. కాని గుల్ల నేలలలో బశువులు దిగబడుటచే నట్టి నేలలలో దమ్ముచేయ వీలులేకనే పోవచ్చును. నాటు కాలమునకు గొంత ముందుగ వర్షమధికముగ గురిసిన యెడల నేల కొంత గట్టిపడుట చేతను గడ్డి గాదములు పెరుగుట చేతను సామాన్యపు నేలలలో దమ్ము సులువుగ గాదు. కాని గుల్ల నేలలలో పశువుల దిగబాటు కొంత తగ్గును. సామాన్యముగ దమ్ము చేయనవసరములేని నేలలు కూడ దమ్ము చేయవలవవచ్చును.

నేలను సామాన్యముగ రెండుసార్లు దమ్ము చేసి పట్టె తోలి చదునుచేసి నీరుపెట్టి సుమారొక వారము దినములు మురగనిచ్చి మరల నాటుటకు ముందు మరియొకసారి దమ్ముచేసి పట్టెతోలి చదును చేయుట యనుకూలమైన పద్ధతి. కొన్ని పరిస్థితులందు నీటి యెద్దడివలన ఒకేసారి మూడు చాళ్ళు దమ్మును చేసి నాటవలసి రావచ్చును. తప్పక వచ్చినపుడే కాని యిట్లు తొందరగ దమ్ముచేసి నాటుట మంచిది కాదు. మరియు పచ్చి యెరువు వేయు నేలలందును, గడ్డి గాదములు విస్తారముగ పెరిగిన నేలలందును, ఇట్లు ముందు రెండుసార్లు దమ్ము చేసి రొట్టను లేక గడ్డి గాదములను బురదలోని కణగద్రొక్కి సుమారు వారము దినములు మురగనిచ్చుట మరింత యావశ్యకము. ఎముకల పొడి గాని, చేపల యెరువును గాని వేయదలచుచో కడపటిసారి దమ్ము చేసిన వెనుకను చదును చేయుటకు ముందుగ చల్లుట మంచిది. ఎముకల పొడిని

చదును చేసిన వెనుక వేసినను వేయవచ్చును. వరిచేలకు వేయదగిన యెరువులను గురించియు ఆయా యెరువులను వేయు కాలమును విధానమునుగురించియు 11 వ శీర్షిక క్రింద విపులముగ జర్చింపబడును.

దమ్ము చేయుటకు సామాన్యముగ చిన్న కర్ర నాగళ్లుపయోగింప బడుచున్నవి. వీనిని దంప నాగళ్లందురు. నాగలి బరువైన యెడల నది లోతునకు దిగుటచే పశువులకు గష్టమెక్కువగును. మరియు దమ్ము మిగుల లోతుగజేయుట-ముఖ్యముగ యడుగునేల యంత మంచిదిగాని చోట్ల-సామాన్యముగ ననుకూలము కాదు.

కొన్ని చోట్ల నిటీవల కూపరు నెం 11, 25 రు కిర్లోస్కారువారి ఘూర్జరు నెం 2 రు, పి. యస్. జి సన్సు వారి నెం 10 రు మొదలగు చిన్న యినుపనాగళ్లు కూడ దమ్ము చేయుట కుపయోగింపబడు చున్నవి. సామాన్యముగ నివి గరుపనేలలకును నిసుక గరుములకును నుపయోగించును. రెక్కరేకుగలిగియుండు నిట్టినాగళ్లు చాలునుండి లేచుమంటిని తిరుగవేసి గడ్డిగాదము లడుగున బడునట్లు కప్పుటచే నవి త్వరలో క్రుళ్లును. కాని యినుప నాగళ్లతో దమ్ము చేసి మళ్లను నాటుటకు సుందొకసారి యైనను కర్ర నాగళ్ళతో దున్నిన గాని బాగుగ దమ్ముకాదు. బంక నేలలలో నినుప నాగళ్ళంతగా నుపయోగింపవు. మంటిని బాగుగ నీటితో కలిపి యదును గా జేయుటకు ఇనుప నాగళ్ళకంటె కర్ర నాగళ్లే యనుకూలము.

ఇనుప నాగళ్ళతో దున్నిన పిమ్మట చురుకుగ దమ్ము చేయుటకు వీలగు దమ్ముమాను (Wetland puddler) అను పనిముట్టొకటి బర్మాదేశమున కొన్ని చోట్ల నుపయోగింప బడుచున్నది. ఇందొక యిరుసుపై కొన్ని పలుగు లమర్పబడి యుండును. (25 వ పటము

## 25 వ పటము.

## దమ్ముచేయుట కుపకరించు పనిముట్టు.

(1941-42 వ సం॥ గ్రామస్థుల పంచాంగము నందలి పటము ననుసరించి చిత్రింప బడినది).



పైన పట్టుకొనుటకు రెండు నిలువు కర్రలపై నడ్డుగా నమర్చబడిన పిడి కలదు.

క్రింద కర్రచట్టమును, దానిమధ్య నొక యిరుసుపై నమర్చబడినపార రేకులవంటి రేకులును గలవు. ఇవియే మంటిని కదిపి యదుసుగా జేయును. చట్టమున కెదుట నమర్చబడిన యేటికోలలో కొంత భాగము గూడ గాననగును.

## 26 వ పటము.

### పచ్చిరొట్టను త్రొక్కించు పనిముట్టు.

(1940-41 వ సం॥ గ్రామస్థుల పంచాంగము నందలి పటము ననుసరించి చిత్రింప బడినది).



పైన రెండు నిలువు కఱ్ఱలపై నమర్చబడిన పిడి గలదు.

క్రింద నొక చట్టమునందొక యిరుసుపై నమర్పబడి కత్తియంచుగల యినుప చక్రములుంగలవు. చట్టమున కెదుట నమర్పబడిన యేటికోలభాగము గూడ గానవగును.

చూడుడు.) పశువులను పూన్చి (యానిని లాగించినపు డీ పలుగులు తిరుగుట వలన మన్ను నీటితో బాగుగ గలిసి చక్కని యడునేర్పడును. ఇటీవల కోయంబత్తూరు పరిశోధనాస్థానమున పరీక్షింపబడి రైతులకు సిఫారసు చేయబడుచున్న యీ విధమగు పనిముట్లు పి. యస్. జి. సన్సు వారిచే విక్రయింప బడుచున్నవి. దీనితో దినమునకు రెండెకరములు తోలవచ్చును. వివరములకు 1941-42 సం|| గ్రామస్థుల పంచాంగము చూడుడు.

పశువు లవసరము లేకుండ యంత్రములతో దమ్ము చేయుటకు ఫిలిప్పైన్ దీవులందును కొన్ని యితర ప్రదేశము లందును యత్నము జరిగెను. కాని యింతవర కవి జయప్రదముగ నుండినట్లు లేదు.

పచ్చి యెరువు సస్యములను పడగొట్టి దమ్ములో నణగద్రొక్కుటకు చాల మంది మనుష్యు లవసరములేకయే పశువులచే లాగింపబడు పనిముట్టొకటి యిటీవల కనిపెట్టబడెను. ఇందు సుమారొక గజము పొడవుగల యిరుసుపై వాడియైన యంచులుగల నాలుగు యినుప చక్రము లమర్చబడి యుండును. ( 26 వ పటము చూడుడు. ) దీనితో దినమునకు సుమారు 2½, 3 యెకరములలో రొట్టను పడగొట్టి త్రొక్కవచ్చును.

దమ్ము చేసినపు డేర్పడు హెచ్చు తగ్గులను సవరించి చదును చేయుటకు సామాన్యముగ చదునుపట్టె యుపయోగింప బడును. కాని తోరములు-అనగా మన్ను గాని, గడ్డి గాదములు గాని, వేసిన పచ్చిరొట్ట గాని చేరి యేర్పడు మంటిదిబ్బలు-పెద్దవిగ నుండుచో పట్టెతోలుటకు ముందు

27 వ పటము



## చదును పట్టె తోలుట

పీని[illegible]ట యవసరము కావచ్చును. గడ్డి గాదములు లేక సులభముగ వచ్చియు చాల్లు తమంతటనే కప్పుకొనిపోయి కొంచె మించు చదునుగ నుండు మళ్లలో పట్టె తోలకయే నాటులు గలదు. కాని యట్టి చోట్ల కూడ తేలికయైన పట్టె నొకసారి తోలుటయే మంచిది.

వరి మళ్ళలో నీరుపెట్టు చోట్ల కొంత ప్రదేశమున క్రమముగ వండలిచేరి మెరక యగుచుండును. కొన్ని సంవత్సరముల కొకసారి ది[illegible] కాలమున నట్టిచోట్ల నుండి కొంత మట్టిని ద[illegible]మళ్ళను బండితో తోలవచ్చును. లేక దమ్ము చేసిన పిమ్మట [illegible]ను గాని నోలను గాని తోలి మెరకనుండి పల్లమునకు కొంత యడుసును లాగివేయవచ్చును. పై మట్టి నిట్లు లాగివేసిన కొలదిని క్రింది నేల[illegible] దమ్ము చేయుచు.

రావలెను. ఇట్లు మంటిని దీయవలసిన లోతుకంటె మరికొంత లోతు వరకు గూడ నచటి మట్టిని దీసివేసి మడిలోని యితర భాగముల నుండి కొంత యెరువును మరల నచోటికి ద్రోసిన గాని యా భాగమున సస్యము బాగుగ ఫలించదు. కేవలము మంటిని తీసివేసిన చోట్ల యెరువు వేసి సాపుచేసి దమ్ము చేయవలెను. ఇట్లు మెరక పల్లములను సమము చేసిన పిమ్మట నొకసారి మరల దమ్ముపట్టె తోలవలెను.

వరిమళ్లగట్లు వేసవిలో బాగుగ యెండి నీరు పెట్టగనే నాని, దమ్ము చేయునప్పుడు పశువులచే త్రొక్కబడి కొంతవరకు చెడిపోవును. మరియు నదిపందికొక్కులు పీతలు యెలుకలు చేసిన కన్నములవలన గూడ గట్లు గుల్లబారి మళ్లలో నీరు నిలువబెట్టుటకు తగియుండవు. కావున కడపటిసారి దమ్ము చేసి పట్టె దోలిన పిమ్మట గట్లను బాగుచేయవలెను. సామాన్యముగ గట్లమన్ను క్రిందికి దిగజారుటచే వాని కిరుప్రక్కలను నేల మెరక తేలియుండును. ఈ మెరకలను గట్లు వెడల్పుగ ప్రాకిపోయిన చోట్ల వాని చెక్కలను పారలతో నరికి గట్లపైకి గాని లోట్లున్నచోట్ల ప్రక్కలను గాని వేసి యవి యన్నియు సమముగు నట్లు వెడల్పుగ గల్గియుండు నట్లును, కన్నములు, బొరుగలు లేకుండగను చేయవలెను. క్రిందిమడి పై మడికంటె మిగుల పల్లముగ నున్నచో మందడిగట్టు యొక్క దిగువ వైపున అంతటను నిట్లు మంటిని వేసి బలపరచిన గాని యందలి పీత కన్నములను ఎలుక కన్నములను కప్పబడి నీరు సరిగా నిలువదు. గట్లు యెలుక కన్నములచే మిగుల గుల్లబారిన చోట్ల వానిని పారలతో దిరుగ గొట్టి బిగద్రొక్కవలసి యుండును. గట్లను బలపరచుటకై మంటిని దీసినచోట్ల మరల పారలతో ద్రవ్వి యడుసుగ చేయవలెను.

పైని చెప్పినట్లు దమ్ము చేసిన పిమ్మట చేయదగు కొద్ది మరమ్మతు గాక, కొన్ని గట్లను యేటేట వేసవిలో బెల్లువిరిచి యా బెడ్డలను పల్లపు మళ్లలోనికి దోలి, మరల క్రొత్త గట్లేర్పరచుట మంచిది. ఇట్లు చేయుచో గట్లు విస్తారముగ గుల్లబారి పోకుండుటచే దమ్ము కాలమున స్వల్ప మరమ్మతు చాలును. ప్రాతగట్లను తీసివేయక పోయినను, చెడిపోయిన గట్లకు వేసవిలోనే కొంత క్రొత్తమంటిని జేర్చి బలపరచుట మంచిది.

దమ్ము చేసినప్పుడు నేలలో గలుగు మార్పులనుగూర్చి యిచట కొంత చర్చింపదగును. నీటిలో గలిసి నేలలోని మంటి రేణువులు దమ్ము వలన విడిపోయి అదివరకు మరియున్న క్రమముమారి వాని వాని బరువును బట్టి మరల సర్దుకొనును. ఇట్లు సర్దుకొనుటలో మృదువగునవి పైకి దేలి బరువగు పెద్ద రేణువులు క్రిందికి దిగును. కావున నేటేట దమ్ము చేయుచు వచ్చిన కొలదిని పై మన్ను క్రమముగ జిగురెక్కును. ఇట్లు పై మన్ను జిగురెక్కి క్రింద ముదుగు రేణువులు చేరుట కొంత వరకు మంచిదే. కాని కొన్ని నేలలందలి పై భాగమిట్లు మిగుల జిగురుదేరి పోవుటగలదు అట్లు మిగుల జిగురుదేరుట వలని నష్టముగూర్చి 5 వ శీర్షిక క్రింద తెలుపబడెను.

దమ్ము వలన నేలయందు గొన్ని రాసాయనిక సంబంధమగు మార్పులు కూడ కలుగును. అందు ముఖ్యమైనది సేంద్రియపదార్థము నీటి యందుండి వరి కావశ్యమగు అమ్మోనియా చేకూర్పబడుట. నేల యందలి యాహారద్రవ్యములందును మరికొన్ని మార్పులు గలుగును. ఈ మార్పు లెట్టి పరిస్థితులందెట్లు జరుగునో యింకను బాగుగ పరిశోధింప బడలేదు. కాని మొత్తముమీద దమ్ము మురుగుట వలన సస్యమున కనుకూలమగు మార్పులు కొన్ని జరుగునని మాత్రము చెప్పవచ్చును.

నేలలో పైని చెప్పినట్లు రాసాయనిక సంబంధమగు మార్పులు గలుగుటకు నేల యందలి సూక్ష్మజీవులు మిక్కిలి సహకారులు. వాని సహాయ్యము లేనిదే సేంద్రియపదార్థము చీకి సస్యమునకు వలయు ద్రవ్యము లేర్పడవు. దంప నేల లందలి సూక్ష్మజీవుల విషయమయి కూడ తగినంత పరిశోధన జరిగియుండలేదు. కొన్ని సూక్ష్మజీవుల యొక్కయు, పాకుడు యొక్కయు సహకారముచే నెట్లు వరిమొక్కల వేళ్లకు ప్రాణవాయువు లభించుచునో 77 వ పుటలో వ్రాయబడెను.

దమ్ము మురిగి నేల సస్యమున కనుకూలమగుటకు తగిన మార్పులు గలుగుటకు గాను వారము లేక పది దినములు ముందే యాపని ప్రారంభించవలెను. కాని దమ్ముచేసిన మళ్లు మరల నారిపోకుండ జూడవలెను. ఇట్లారిపోవుచో నేల యందు మరల కొన్ని ప్రతికూలమగు మార్పులు జరుగ నారంభించి యది మరల పూర్తిగ నెండువరకును సస్యమున కనుకూలము గాదు. అనగా నా సంవత్సరపు పంట చెడకతప్పదు.

కొన్ని పరిస్థితులలో పైని చెప్పినట్లు వారము పది దినములు దమ్ము మురగనిచ్చుటకు వీలులేకపోవచ్చును. మురగనిచ్చి నాటులోపల నీటి యొద్దడి గలిగి నేల యారిపోవునని తోచినపుడు వెంటనే నాటవలసి యుండును. మరియు **61, 62** పుటలలో వ్రాయబడినట్లు నాటుట లేక విత్తుట ఆలస్యమైన కొలదిని పంట తగ్గుచుండును. కావున దమ్ము మురగనిచ్చుటకై వారము పది దినము లాలస్యము చేసి నాటుట యుక్తమా లేక దమ్ము మురుగకపోయినను వెంటనే ముదురుగ నాటుట మంచిదా యను ప్రశ్న బయలుదేరును. ఈ విషయము స్థితిగతులను బట్టి యాలోచించుకొనవలెను. నారు నాటు పద్ధతిలో తగినంత వర్షము కురియగనే గాని నీరందగనే గాని నారుపోసి యా నారెదుగు లోపలనే

దమ్ము మురుగుటకు దగినంత వ్యవధి గా దమ్ము పట్టవలెను. దమ్ము చేయుటకు యింకను ముందుగనే నీరందుచోట్ల నంతకుముందే దొరువులు, నూతులు, కోన్నేళ్లు మొదలగువాని యాధారమున నారుపోసి నీరందగనే దమ్ము చేసి నాటుట శ్రేష్ఠము. ఇట్లు వర్షములు గురిసి నేల గట్టిపడి గడ్డి గాదములు బలియక మునుపే నీరు పెట్టి దమ్ము చేసిన నేల యొక్క బిగిరము తగ్గకుండగనే ముదురుగ నాటగలుగుచో దమ్ము మురుగ వలసిన యావశ్యకత కూడ యంతగా నుండదు. మరియు నేలలను చే గాని నారు పోవు పైకూడ దమ్ము చేయ సాధ్యపడక పోయినప్పుడును, చుట్టుపట్ల పొలమంతయు నాటబడి మధ్య కొన్ని మళ్లు దిగబడినప్పుడును దమ్ము బాగుగ మురుగు వరకు నాలస్యము చేయుట అవసరముగునా మరి యొకసారి యదనముగ దమ్ము చేసి వెంటనే నాటుటయే మంచిది. ఒక్కొకప్పుడు దమ్ము మురుగులోపల గాలి రేట్లు విపరీతముగ హెచ్చిపోవును. అట్టి సందర్భములను కూడ కనిపెట్టి కృషీవలుడు దమ్ము మురుగనిచ్చుటకు గాను నాటుట యాలస్యము చేయుట లాభకరమగునో ముందుగ నాటి కొంత వ్యయము తగ్గించుకొనుట మంచిదో యోచించుకొనవలెను.

దమ్ము చేసి పెదజల్లు పద్ధతిలో కూడ పై విషయములను గుర్తించి కర్తవ్యమును నిర్ణయించుకొనవలెను.

కొన్ని చోట్లను కొన్ని పరిస్థితులందును, నేలను ముందు మెట్ట సాగు చేసి పిమ్మట నీరు పెట్టి నాటుట గలదు. ఈ పద్ధతి యీ దేశమందు కొన్ని భాగములందును, కొన్ని విదేశములందును కూడ గలదు. సామాన్యముగ మిగుల తేలిక నేల యయినదప్పు మెట్టసాగు దంప నేలలకు మంచిది కాదని చాల మంది యనుభవజ్ఞుల యభిప్రాయము. గొన్ని వ్యవసాయ స్థానములందలి పరిశోధనలు కూడ దీనిని బలపరచుచున్నవి. సామర్థ్

కోట పరిశోధనాస్థానమున 6 సంవత్సరముల తణిఖీలో మెట్టదుక్కి దున్ని నీరు పెట్టి నాటినను మళ్ళకంటె సగటున ఎకరమునకు నూటికి 15-35 ధాన్యమును హెచ్చుగ నిచ్చెను.[33] చాల వ్యవధిగా అనగా వెనుకటి పైరు కోసిన వెంటనే శీఘ్రకట్టున దున్నుట కంటె నీరుపెట్టి నాటుటకు ముందు అనగా తొలకరిలో దున్నుట తక్కువ హానికరమని కూడ తేలెను.

మెట్టదుక్కి వలన పంటతగ్గుటకు కారణము నేల గుల్లబారుట యని యనుభవజ్ఞులగు వ్యవసాయదారులు చెప్పుచుందురు. సహజముగ జిగురు నేలలకే గుల్లబారు స్వభావము హెచ్చుగ గలదని 67 వ పుటలో వ్రాయబడెను. కాని మెట్టదుక్కి వలన నేల యెట్లు గుల్లబారునో యింకను బాగుగ తెలియదు.

దమ్ము చేసినపుడు జిగురు నేలలోని మృదువగు రేణువు లన్నియు దగ్గరచేరి నేలను చిక్కబడును. మెట్టపడి మెట్టదుక్కి దున్నిన యెడల గడ్డలు గట్టిగ పగులును. ఈ గడ్డలు యెండిన తొలకరిని వాని యందంతటను పగుళ్లేర్పడి కొన్ని కొన్ని రేణువు లొక గుంపుగా జేరును. ఇట్లు చేరుటచే [illegible] మీద పిడకను కాల్చిన కచ్చికవలె మంటిని నీటిని పట్టి యుంచు స్వభావము హెచ్చుగ గలుగును. ఇదియే గుల్లబారుట యని యూహింపబడి యున్నది.

ఇట్లు నేల గుల్లబారి నీటిని పట్టుకొని విడువక పోవుటచే అందలి నీటియొక్క సంచారము తగ్గును. ఎల్లప్పుడును నీటిలో నుండు వరిమొక్కకి యీ నీటి సంచారము లేక నిలవయుండు నీరు హాని చేయక మానదు.[33]

ఇటీవల జరిగిన పరిశోధన వలన[30] నేలపై పెరుగు పాకుడువంటి వృక్షజాతులును కొన్ని సూక్ష్మజీవులును సేంద్రియపదార్థము నుండి వరి

వేళ్లకు వలయు ప్రాణవాయువునుత్పన్నము చేయుననియు ఈ ప్రాణవాయువును బీల్చిన నీరు క్రిందికి మెల్లగ నింకుచున్న గాని వేళ్ళకది తగినంత లభింపదనియు కనిపెట్టబడెను. కావున నేలలో కొంతవర కిట్టి జలసంచలనమున్న గాని చేనికి నష్టముగలుగును. నేల గుల్లబారుట వలన నిట్టి సంచలనమున కవరోధము గల్గుటయే మెట్టదుక్కి వలన పంట తగ్గుటకు గారణమని యూహింపదగి యున్నది.

ముందుగ మెట్టదుక్కి దున్నుటవలన నందు సహజముగ పెరుగు గడ్డి గాదములు పెరుగ వీలులేకపోవుటచే గూడ నష్టము సంభవించును. కొన్ని నేలలలో నేల గుల్లబారుట విషయమటుండ తొలకరించిన పిమ్మట కుక్కవావింట మొదలగు సహజముగ బెరుగు జాతుల రొట్టయు నితర గడ్డి గాదములును ఒక్కొక్కప్పుడు ఎకరము 1 కి 5, 6 వేల పౌనులకు మించును. ఇట్టి నేలలను ముందుగ మెట్టదుక్కి దున్నినయెడల నీరొట్ట పెరుగ వీలులేదు గదా! ఇంతరొట్టను దమ్ము చేసినపుడది నేలలో చీకి హెచ్చుపంట నీయుదా?

వ్యవసాయదారు లిట్లు మెట్టదుక్కి వలన నష్టము గలదని యెరిగియు, కొన్ని చోట్ల నిట్లు దున్నుటవలన నేలయొక్క వేగిరము పోక ముందే నాటుట కవకాశము గలుగుట వలనను, దమ్మునకు 3, 4 జతల పశువులు కావలసిన ప్రదేశపు మెట్టదుక్కి కొక జతయే చాలుటచేతను ఈ పద్ధతి నవలంబించుచున్నారు.

ముందు మెట్టదుక్కి దున్నిన నేల నయినను నాటుటకు ముందొకసారి దమ్ము చేయుట వలన నట్టిదుక్కి వలని నష్టము కొంతవరకు తగ్గును.

మెట్టదుక్కి దున్నుటచే గుల్లబారిన నేలలు చేను కోతకు వచ్చుసరికి అరి గట్టిపడక పోవచ్చును. గుల్ల నేలలోని చేను పండి కోతకు వచ్చుటకు గూడ యించుక యాలస్యమగును.

మెట్టదుక్కి దున్నిన నేలలు యొద్దడి సంవత్సరములలో బాగుగా ఫలించును. హెచ్చు వర్షములు కురిసినను నీరు మళ్ళలో పెడతెగక నిలచినను ఆ సంవత్సర మట్టి నేలలు బాగుగా ఫలింపవు.

కొన్ని నేలలలో మెట్టదుక్కి వలన చేను కొన్ని సంవత్సరములవరకు బాగుగనే పెరిగి నాలిక మాత్రమే తగ్గును. ఒకానొక తణిఖీలో మెట్టదుక్కి దున్ని మిరిల దమ్ముచేసిన నేలలో ఎకరమునకు 2717 పౌనుల ధాన్యమును, 4431 పౌనుల గడ్డియు కాగా అట్లు దున్నకయే దమ్ముచేసిన నేలలో 3403 పౌనుల ధాన్యమును, 4172 పౌనుల గడ్డియు నదిచ్చెను.[10] మెట్టదుక్కి దున్నిన నేలలో గడ్డికిని, ధాన్యముకును పరిమాణము అట్లు దున్నని దానిలోకంటె సామాన్యముగ తక్కువగ నుండును. పై పరీక్షలో మెట్టదుక్కి దున్నిన నేలలో నీ పరిమాణము నూటికి 61 ఉండగా అట్లు దున్నని నేలలో నూటికి 82 ఉండెను. ఈ విషయము నింకను చాలచోట్ల పరిశీలించి ధృవపరుపదగును.

మెట్టదుక్కి దున్నిన నేలలో పండు ధాన్యము అట్లు దున్నని నేలలోని ధాన్యముకంటె తేలికగ నుండునని కొందరి యభిప్రాయము. ఈ విషయమును కూడ నింకను పరీక్షింపవలసి యున్నది.

కొన్ని వరి నేలలలో కోతకు ముందు తొలకుచల్లు సమయమున సస్యములు(పెసర, మినుము, జనుము) మెట్టదుక్కి దున్నిన మళ్ళలో దమ్ము చేసిన మళ్ళలోకంటె బాగుగా పెరుగును. దున్నిన మళ్ళలో చేను కోసిన వెనుక పదును త్వరగా పోక కొంత కాలము నిలచుండుటచే మంచిదిగా నుండును. కాని చిరకాలమిట్లు మెట్టదుక్కి దున్నుచుండగా సస్యములును బాగుగ పెరుగుట మానును. గుదిదు నేల గబ్బుచేసి ( అంటగా లేకున్న స్థితిక వచ్చి) చేను పండిన వెనుక కోతకు గాని తరువాతి సూపు మొలకలు సస్యముల కొరకు నేలను తయారు చేయుటకు గాని ఆటంకము కలుగును.

ఇట్లు ఉబ్బ చేయుటకు పట్టు కాలము క్రింది నేల యొక్క స్థితిని బట్టి యుండును. క్రింది నేల యిసుక గాడిగా నుండి జల నిర్గమనము బాగుగ నుండు నేలలలో నీళ్ళు చెరుపంతగా నుండవు. అడుగున చట్టుకొనిన కంకర గాని మిక్కిలి జిగురుగనుండి నీటి నింకనీయని బంకమన్ను (నూనెరేవడి వంటిది) గాని యున్నయెడల నీళ్ళు నేలలు త్వరలో ఉబ్బ చేయును.

సామాన్యముగ దమ్ము చేయుటకు కష్టముగ నుండు బంక నేలలను, మిక్కిలి దిగువాటుగనుండు గుల్ల నేలలను మాత్రమే మెట్టదుక్కి దున్నవలెను. వర్షాధారపు నీటి వసతుల క్రింద నీరందుట ఆలస్యమగు సందర్భమున గరుపకొడి నేలలో కూడ ముందుగ మెట్టదుక్కి దున్ని నీరందగనే పైరు నాటుటకు సిద్ధము చేసి యుంచుకొందురు.

రెండవ పంటకు నేలను దమ్ము చేయుట మొదటి పంటకు దమ్ము చేయుట కంటె కష్టము. అప్పటికి నేల గట్టిపడి, మన్ను సులభముగ విడిపోదు.

మొదటి పంటను గోసినవెనుక త్వరలో నారు నేలలలో భౌతికస్థితి బాగుపడి రెండవపంట బాగుగ ఫలించును. అట్టి నేలలలో మేతకొరకుగాని పచ్చి యెరువునకుగాని పెట్టు జనుమును తీగ పెసరయు, లేక పంటకొరకు పెట్టు పెసర మినుము మొదలగునవియు కూడ నేల యారుటకు తోడ్పడును. చవటి కొంచి నేలలలో నీ సస్యములు పెరుగవు. నేలయు నారదు. కావున నిట్టి నేలల లోను, చవుడు లేకపోయినను తగినంత త్వరలో నారని పల్లపు నేలలలోను, మొదటి పంట కోతయయిన తరువాత వెంటనే నీరుపెట్టి రెండవ పంటకు దమ్ము చేయుకాలము వచ్చువరకు మళ్లలో నీరు నిలచునట్లు చేయుదురు. ఇట్లు చేయుటకు దంటుతడుపు అందురు. వెనుకటి పంట కోతగాలును, దమ్ము చేయునప్పటికుండు కలుపు మొక్కలును క్రుళ్లి సత్తువజేయును. నీరు నిలచుట వలన పైకి చవుడు ఊబుకుట మాని పంట శీఘ్రముగ హెచ్చును.

---

## 11. దంపవరులకు దగిన యెరువులు-వాని యుపయోగము.

ఒక యెకరమున నుత్పత్తియగు సుమారు 17 కాటా బస్తాల ధాన్యమును, 2½ బండ్ల గడ్డియు నేల నుండి సుమారు 26 పౌనుల నత్రిజనిని, 16 పౌనుల స్ఫురత్పంచామ్లజనిదమును, 28 పౌనుల పొటాషును హరించునని లెక్క వేయబడెను.[41] ఈ మూడు ద్రవ్యములలోను సామాన్యముగ దంప నేలలకు యెరువు రూపమున జేర్చ వలసినది నత్రిజనియు, స్ఫురమును మాత్రమే యని 5 వ

శీర్షిక క్రింద చేయబడిన రాసాయనిక పరిశీలనము తెలుపు చున్నది. ఈ రెంటిలోను మరల నత్రజనియే ముఖ్యావసరమైనది.

సామాన్యముగ మెట్ట వరులును, వర్షపు పదునున విత్తబడి సస్యము కొంతకాల మెదిగిన పిమ్మట నీరు కట్టబడు వరులును, మెట్ట ఆకుమళ్లలోని నారును మెట్ట సస్యములన్నిటి వలెనే తమకువలయు నత్రజనిని నత్రిత రూపమున దీసికొనును. దమ్ముచేసి నాటు వరులకు కూడ నాటిన కొలది కాలము వరకు నేలయందలి నత్రితము లిందు కుప యోగపడును. కాని యిట్టి నేలలలో నీరు పెట్టిన కొలది కాలములో నేల యందదివరకుండిన నత్రితములు గాని, వేయబడిన యెరువు లందలి నత్రితములు గాని చాల వరకు తగ్గిపోవును. * కొంత భాగము పెట్టిన నీటిలో కరిగి క్రిందికి దానితో నింకిపోవును. లేక పైకిపోవు నీటితో బాటు నష్టమగును. చాల భాగము కొన్ని నిర్వాయు (Anaerobic)

---

*ఒకానొక పరిశోధన యందు జూన్ నెలలో వర్షములు గురియకు ముందు ప్రతి 10000 గ్రాముల మంటిలోను 3. మిల్లిగ్రాముల నత్రజని నత్రిత రూపమున నుండగా నీరుపెట్టి దమ్ముచేసి వరి నాటిన పిమ్మట (జూలై నెలలో) 4 మిల్లిగ్రాములు మాత్రమే యీ రూపమున నుండెను. 42

పరిస్థితు లందు బెనుగు సూక్ష్మజీవుల మూలమున రసాయ
నిక వియోగము నొందును.

దంప నేలలలో నీరుపెట్టక ముందుగా నత్రితములు ఇట్లు చాల వరకు తగ్గిపోవుటయే గాక, అందు నీరుండు నంత వరకు ప్రాణవాయు లోపముచే నత్రితోత్పాదక సూక్ష్మ జీవులు చురుకుగ బనిచేయ వీలులేనందున ఆంగిక సేంద్రియ పదార్థము నుండి జనించు అమ్మోనియా నుండి మరల నత్రి తము లుత్పన్నమగుట కవకాశముకూడ లేదు. కావున దంపవరులకు నేల నుండి గాని, అందు వేయబడు యెరువుల నుండిగాని నత్రితరూపమగు నత్రిజని నాటిన పిమ్మట స్వల్ప కాలము వరకే గాని పిమ్మట లభింపదు. అయినను వరి మొక్క తనకు వలయు నత్రిజనిని సేంద్రియపదార్థము నుండి నిర్వాయు పరిస్థితులలో గూడ జనించు అమ్మోనియా రూపమున సైతము తీసికొనగల్గుటచే దానికేమియు కొరత లేదు. నాటినది మొదలు పంట ముఖమునకు వచ్చువరకు నీటిలోనే జీవితమును గడపవలసి యుండు దంపవరి కిట్టి శక్తియే లేనిచో ప్రపంచమున నీ సస్యమున కింత ప్రాము ఖ్యత గలుగకుండెడిదే. మరియు దంపవరి వేర్లకుగూడ పెసర, మినుము మొదలగు చిక్కుడు కుటుంబము నందలి జాతులలో వలె కొన్ని సూక్ష్మజీవుల సహాయమున కొంత

నత్రిజనిని పరిపాదించుకొను శక్తి గలదని కొన్ని పరిశోధనల వలన దేలెను.[43]

దంపవరికి వేయు యెరువులను, వానిని వేయు విధాన మును నిర్ణయించుటలో నీ సస్యమునకును, మెట్టసస్యము లకును గల పైని వ్రాయబడిన ముఖ్య భేదమును బాగుగ గుర్తింపవలెను. మెట్ట సస్యముల కమృతతుల్యములగు నత్రితములు మెండుగ గల యెరువులు దంపవరి కుపయో గించుట లాభకరము గాదు. మళ్లలో వేసిన పిమ్మట త్వరలో చీకి, సస్యమునకు అమ్మోనియా నొసగు సేంద్రియ పదార్థము విస్తారముగ గల యెరువులే దంప వరికి మంచివి. కావున సులభముగ జీకు ఏజంతు, వృక్ష సంబంధమైన స్థూల పదార్థమైనను కూడ దంప వరి కుపయోగించును.

నత్రిజనిని హెచ్చుగా గలిగి మళ్లలో వేసిన వెనుక అమ్మోనియా నొసగు తైలపిష్టములు, రక్తపుపొడి మొదలగు వృక్ష, జంతు సంబంధములగు యెరువులును, అమ్మోనియా గంధకితము మొదలగు కృత్రిమపు యెరువులును కూడ దంపవరి కుపయుక్తములుగ నుండును. కాని వానియందు పైని పేర్కొనబడిన స్థూలపదార్థములనుండి వలె అమ్మోనియా క్రమముగ గాక కొంచె మించు ఒకేసారి పుట్టుటచే

వానిని మిగుల మెలకువతో వాడవలసి యుండును. మరియు వానివెల లయధికముగుటచే నవి గిట్టుబాటుగ నుండుట గూడ యరుదు. వానియందు నత్రజని మెండుగ నున్నను వాని మూలమున నేలకు తగినంత సేంద్రియ పదార్థము లభింపక పోవుటచే నట్టి పదార్థము చీకుటవలన దుబ్బుల వేళ్లకు లభ్యము కాదగిన ప్రాణవాయువు లభ్యము కాదు. 77 వ పుటలో వ్రాయబడినట్లు పై సూత్రములనను సరించి దంప వరులకు వేయదగిన ముఖ్యమగు యెరువులను గూర్చియు, వాని నుపయోగించు విధానమును గూర్చియు నీక్రింద కొంత వివరముగ వ్రాయబడును.

1. పచ్చిరొట్ట-ఇతర ఆకలములు:— దంపవరికి వేయదగు యెరువులలో పచ్చిరొట్ట శ్రేష్ఠమైనది. వ్యవసాయదారులకు స్వల్ప వ్యయముతోను, స్వల్ప పాటుతోను లభ్యమగుటయే గాక త్వరలో చీకుటచే నందలి నత్రజని సస్యమునకు అమ్మోనియా రూపమున లభ్యమగును. ఈ యెరువు యొక్క ప్రాశస్త్యతే ఆయా వ్యవసాయ పరిశోధనా స్థానము లందు పెక్కుసార్లు పరిశోధింపబడి నిరూపింపబడెను. కొన్ని ప్రదేశము లందలి వ్యవసాయదారులు చిరకాలము నుండి పచ్చిరొట్టను యెరువుగ నుపయోగించుచు దాని ప్రాశస్త్యతను గుర్తించియే యున్నారు. ఈ యెరువు వలన పంటలో గలుగు హెచ్చుదల నేల యందది వరకున్న సత్తువను బట్టియు వేయబడు రొట్ట పరిమితిని బట్టియు కాలమాన స్థితిని బట్టియు నుండును. అనకాపల్లి పరిశోధనా స్థానమందు ఏ యెరువును వేయని మళ్లలో కంటె పచ్చిరొట్టను ఎకరమ 1 కి 3000 పౌనుల చొప్పున వేసిన

మళ్లలో నేడేండ్ల (1927-33) పై సగటున నెకరమునకు నూటికి 12.5 చొప్పున ధాన్యమును 21 చొప్పున గడ్డియు హెచ్చుగనై యెరువు ఖర్చు పోను రు 7-3-4 లు హెచ్చు లాభము గలిగెను. బీదనేలలో రొట్ట పరిమితిని ఎకరము 1 కి 6000 పౌనుల వరకు లాభముకరముగ హెచ్చింప వచ్చును. బరంపురం పరిశోధనాస్థాన మందలి యొక పరీక్షలో (1934) నెకరమునకు 2000 పౌనుల రొట్ట వేసిన మడిలో ధాన్యపు రాలిక నూటికి 14 చొప్పునను, 4000 పౌనులు వేసిన మడిలో నూటికి 24 చొప్పునను, 6000 పౌనులు వేసిన మడిలో నూటికి 37 చొప్పునను హెచ్చరయ్యెను. అదివరకే సత్తువ గలిగి బాగుగ చేసెడుగు మళ్లలో రొట్ట వేసిన అంతగా ప్రయోజన ముండదు. గడ్డి హెచ్చుగ నైనను ధాన్యపు రాలిక అంతగా పెరుగదు. ఇట్టి నేలలలో రొట్ట హెచ్చుగ వేసిన రాలిక తగ్గుటయు గలదు.

లభించినంత వరకు బంజరు నేలలందును, బాటల ప్రక్కలను స్వతస్సిద్ధముగ పెరుగు వెంపలి, కసింద, తంటిప, జిల్లేడు, నేపాళం, అంకుడు, తంగేడు వంటి మొక్కలు లేక తుప్పల నుండియు, కానుగ, నిద్రగన్నేరు, వేప, గంగరావి మొదలగు చెట్ల నుండియు లభించు రొట్ట‡ నంతటిని వరి చేలకు పచ్చి యెరువుగ నుపయోగించవచ్చును.

---

‡ వెంపలి రొట్టలో నూటికి 3 2 ను, తంగేడు రొట్టలో నూటికి 2.0 ను, అడవి రొట్టలో నూటికి 1.2 ను, నిద్రగన్నేరు రొట్టలో నూటికి 3.3 ను నత్రజని యుండునని లెక్కచేయబడెను. ఈ యంకెలు తేమను మినహాయించి శుష్కపదార్థముల మీద లెక్క గట్టినవి. పచ్చి రొట్టలో సామాన్యముగ నిందు ఆరవ వంతు నత్రజని యుండునని చెప్పవచ్చును.

ఇట్లు పైనుండి తెచ్చి వేయబడు రొట్ట చిక్కుడు కుటుంబములో జేరిన వెంపలి, కసింద, నిద్రగన్నేరు మొదలగు వానివలె కొన్ని సూక్ష్మ జీవుల సహాయమున వాయువునుండికూడ నత్రజనినితీసికొను జాతులరొట్టయా లేక జిల్లేడు, సేపాళం, వేప మొదలగు వానివలె నేలనుండి మాత్రమే తీసికొను జాతులరొట్టయా యను పృచ్ఛయవసరములేదు. రొట్టలో తగినంత నత్రజని యుండుటయు అది త్వరలో చీకుటయు మాత్రమే గమనింపదగిన ముఖ్య విషయములు. అయా జాతు లన్నిటియందును గల నత్రజని పరిమితి యింకను నిర్ణయింపబడి యుండలేదు. కాని చిన్న మొక్కలుగ నెదుగు జాతులలో వెంపలి రొట్టలోను పెద్దచెటగు వానిలో నిద్రగన్నేరు రొట్టలోను నత్రజని హెచ్చుగ నున్నట్లు తేలెను. చిక్కుడు కుటుంబములో జేరక పోయినను జిల్లేడురొట్టకూడ యెక్కువ సారవంతమైనదని అనుభవము వలన కనిపెట్టబడెను. నత్రజని తక్కువగ నున్న రొట్టను కొంత హెచ్చుగ వేసినచో నీ లోపము గనబడదు. ఆడ్డసరము, వేప మొదలగు కొన్ని జాతుల రొట్ట కొంత వరకు కీటక నివారకమని యెంచబడు చున్నది.

బంజరు నేలలు గాని, అడవులు గాని అంతగాలేని డెల్టాభూములవంటి ప్రదేశములలో స్వతస్సిద్ధముగ బెరుగు జాతులనుండి తగినంత పచ్చరొట్ట లభించుట కష్టము. కావున బలము చేయదలచిన మళ్ల లోనే కొన్ని జాతుల విత్తులను జల్లి రొట్టనుపెంచి దానినా మళ్ళలోనే గాని హెచ్చుగ పెరిగిన యెడల కొంత రొట్టనుగోసి యితర మళ్ళలో వేసి గాని దమ్ము చేయవచ్చును.

పైనుండి తెచ్చిన రొట్ట వేసినచో నది నేలకు కొంత సత్తువను క్రొత్తగ జేర్చునని యందరకును సులభముగ గ్రాహ్యమగు సంగతియే. కాని

పత్తువ చేయదలచిన మళ్ళలోనే విత్తులను జల్లి పెంచిన రొట్టను ఆ మళ్ళ యందే దమ్ము చేయుటవలన నేలకు క్రొత్తగా నెట్లు సత్తువ గలుగునని కొందరికి సంశయము గలుగవచ్చును. వరి చేలకు పచ్చి యెరువు వలన గలుగు మేలు చాల వరకు పైని వ్రాసినట్లు అందలి సేంద్రియపదార్థము చీకుట వలననే గలిగియున్నది. మరియు పచ్చి యెరువు కొరకు పెంచు సస్యములు చాల వరకు చిక్కుడు కుటుంబములో జేరినవగుటచే నవి తమ పెరుగుటకు కావలసిన నత్రజని పై నంతగా నాధారపడక వాయువు నుండి కొన్ని సూక్ష్మ క్రిముల సహాయమున దానిని సంపాదించుకొన గలుగుటచే నీ యదనపు నత్రజని కూడ తిరువాత సాగు చేయబడు వరిచేని కుపయోగ పడుచున్నది.

పచ్చి యెరువుగాను ప్రత్యేకముగ పెంచబడు సస్యములలో జనుము, జీలుగ, తీగపెసర లేక గోధుమపెసర, పిల్లిపెసర, నీలి, వెంపలి యివి ప్రధానములు.* ఇవి యన్నియు చిక్కుడు కుటుంబములోని వగుటచే వాయువు నుండి కూడ కొంత నత్రజనిని సేకరింప శక్తిగలవే. జనుము మిగుల త్వరలో పెరుగును. దీని రొట్టయు మిగుల త్వరలో చీకును. జీలుగ జనుమంత త్వరితగా పెరుగదు. కాని అంతకంటె మోటయినది. అధిక వర్షములచే చెడదు. ఇది యిసుక చవటిగొడ్డు నేలలందు కూడ మొలచి యెదుగును. తీగపెసర కూడ అంత చురుకుగ పెరుగదు. కాని కొంత ముందుగ జల్లినను జనుము వలెను జీలుగ వలెను

* జనుములో సుమారు నూటికి .7 ను, జీలుగలో సుమారు నూటికి .6 ను నత్రజని యుండునని లెక్క వేయబడెను.[45] పెసరలో సుమారు నూటికి .7 ను, నీలిలో సుమారు నూటికి .8 ను యుండునని లెక్క వేయబడెను.

గట్టిబారక రొట్ట మృదువుగ నుండును. పిల్లిపెసర వరపును యివకను గూడ కొంతవర కోర్చును. నీలియు, వెంపలియు బీటలువేయని నేలలలో వరపున కాగును.

విశాఖపట్నం జిల్లాలో వలె వరికి ముందు పునాస పంటలు పెట్టు ఆచారము గల చోట్ల వానిని విత్తు కాలముననే కొన్ని మళ్ళలో జనుము గాని, జీలుగ గాని, తీగపెసర గాని పచ్చియెరువు కొరకు పెంచవచ్చును. లేక పునాస పంటలు పెట్టు కొన్ని మళ్ళచుట్టును కొంత భాగమున వీనిని చల్లవచ్చును. లేక పునాస పంటలతో వీనిని కలిపి పెంచి పిమ్మట వాని కోతగాలుతో సహా వీనినిగొట్టును కూడ దమ్ము చేయవచ్చును. పునాస పంటలు పెట్టు ఆచారము లేనిచోట్ల కూడ అదివరకె పయిరుమావు వగ్గరాలు పెట్టిన మళ్ళలో గాని చెరుకుతోట తీసివేసిన మళ్ళలో గాని వీనిని తొలకరించగనే వర్షపు పదునున చల్లవచ్చును. నీరున్నచో సారువా వరి నాటుటకు సుమారు రెండు నెలలు ముందు ఇట్టి మళ్ళను తడిపి జనుమును, జీలుగను విత్తవచ్చును. తీగపెసరను మరియొక నెల ముందుగనే విత్తవచ్చును. పిల్లిపెసర, వెంపలి, నీలి వీనిని సారువా వరిచేల కోతకు 5,6 రోజులు ముందు తొణుకు చల్లవచ్చును. జనుమునుకూడ నీ కారున జల్లవచ్చును. దాళువా వరి పెట్టు నేలలలో నిట్లు జల్లు జనుమును పిల్లిపెసరను ఆపంట కెరువుగా దమ్ము చేయవచ్చును. దాళువా పంట లేని నేలలలో జనుమును పూతగొమ్మమీద కోసి యెండబెట్టి వేసవిలో వరి మళ్ళలో వేసి పశువులను మేపుకొనవచ్చును. మిగిలినచో దీనిని కూడ మళ్లలో వేసి దమ్ము చేయవచ్చును. మారుటేరు క్షేత్రమున రెండు సంవత్సరములు పరీక్షింపగా యెకరము 1 కి 2000 పౌనుల యెండు జనుము వేసిన మళ్లు యే యెరువును వేయని మళ్ల కంటె నూటికి 28 వంతులు హెచ్చుధాన్యము నిచ్చెను. పిల్లిపెసరను అప్పుడప్పుడు కోసిగాని మళ్లలో గాని పశువులచే

మేపుకొనుచుండ వచ్చును. తొలకరించిన పిమ్మట మోడు మరల చిగిర్చి సారువా పంటకు కొంత రొట్ట నిచ్చును. నీలిని వెంపలిని తరుచు పెసరతో గాని, మినుముతో గాని, కలిపియు చల్లుచుందురు. లేక వరి కోతలకు వెనుక నేలను దున్ని పయరమావుతో కలిపి చల్లుదురు. ఈ రెండును నెమ్మదిగ పెరిగి మరుచటి సారువాపంటకే యుపయోగించును.

దంటుతడుపు నేలలలో తగినంత నీరు లభించుచోట్ల మొదటిపంటను గోసిన వెనుక మార్చి నెల వరకు గాని నీరందు వరకు గాని మళ్ళలో నీరు పెట్టి యుంచి యపుడు జనుముగాని, జీలుగగాని, తీగపెసరగాని చల్లిన బాగుగ నెదిగి తరువాతి సారువాపంట కెరువుగ నుపయోగించును. ఈపద్ధతి చౌటి నేలలకు చాలమంచిది. అట్టి నేలలలో జల్లుటకు జీలుగ చాల యనుకూలము రెండవ పంట పెట్టు నేలలలో నా పంటను గోయుటకు ముందు కూడ నిట్లు చల్లి తరువాత సారువా పంటకు రొట్టను పెంచవచ్చును.

జనుప విత్తుల నెకరమునకు సుమారు 25-30 పౌనులు చల్లవచ్చును. జీలుగ విత్తులు 16-20 పౌనులు చాలును. తీగపెసర, పిల్లిపెసర 12-16 పౌనులు చాలును. తీగపెసరను జనుముతో గాని, జీలుగతో గాని కలిపి జల్లునెడల కడపటి రెండు విత్తులను సగము తగ్గించవలెను. నీలి విత్తులను ఎకరమునకు సుమారు 12 పౌనుల చొప్పునను, వెంపలి విత్తులను సుమారు 16 పౌనుల చొప్పునను చల్లవచ్చును. పెసరతో గాని, మినుముతో గాని, పయరమావుతో గాని కలిపి జల్లుచో 8 పౌనుల నీలి విత్తులును, 12 పౌనుల వెంపలి విత్తులును చాలును.

సామాన్యముగ వెంపలి 3000 మొదలు 5000 పౌనుల రొట్ట నొసగ కిచ్చును. తక్కినవన్నియు నెకరమునకు సామాన్యముగ 5000 మొదలు

10000 పౌనుల రొట్టవరకు నిచ్చును. అనుకూల పరిస్థితులందు 20,000-30,000 పౌనుల రొట్ట వరకు కావచ్చును.

సామాన్యముగ నేలయొక్క సత్తువను బట్టి ఎకరమునకు 2000 పౌనులు మొదలు 6000 పౌనుల రొట్టవరకుపయోగించ వచ్చునని పైని వ్రాయబడెను. ఏ మడిలో నే పరిస్థితు లందెంత రొట్ట వేయవలెనో అనుభవము వలన నిర్ణయించుకొనవలెను. బీద నేలలకును పునాస పంటలకును ఆలస్యముగ నాటు మళ్ళకును సామాన్యము రొట్ట హెచ్చుగా పడవలెను. వేసవిలో ఎండలు మిక్కుటముగ నుండి వరి నాటుసరికి వర్షములు కురిసి యుండక నేల వేగిరము తగ్గని సంవత్సరమున పచ్చి యెరువు తగ్గించి వేయవలెను. ముందుగ వర్షములు కురిసి నేల తడిసి వేగిరము తగ్గిపోవుచో రొట్ట హెచ్చుగ వేయవలెను.

పచ్చి యెరువు వేసి దమ్ము చేసిన పిమ్మట సుమారొక వారము దినములలో నందుండి అమ్మోనియా పుట్టి సస్యమున కందనారంభించును. నాలుగు వారములవరకు క్రమముగ అమ్మోనియా యుత్పత్తి హెచ్చును. మరి రెండు వారములవరకు నీ యుత్పత్తి హెచ్చు స్థాయిలోనుండి పిమ్మట తగ్గనారంభించును. సస్యము కోతకు వచ్చు లోపల రొట్టలోని నత్రజని చాల భాగమిట్లు మారిపోవును. కావున నొక పంటకు వేసిన పచ్చి యెరువు వలన మరుచటి పంట కంతగా సత్తువ నిలువదు. కాని ముఖ్యముగ చీకని గడ్డి గాదములు ఆకలములు వేసి నపుడు ఒక పంట ముగియు లోపల చీకగా మిగులు కొంత భాగము మరుచటి పంటకు కూడ పని చేయవచ్చును.

సేంద్రియ పదార్థము దంపనేలలో చీకినపుడు కొన్ని హానికరములగు ద్రవ్యములు కూడ యుత్పన్నము లగునని 77వ పుటలో వ్రాయబడెను పచ్చి యెరువు వేసినపుడివి మరింత యధికముగ బుట్టును. ఇవి యెప్పటికప్పుడు నీటితో కలసి పోవుచుండిన గాని సస్యమునకు హాని గలుగవచ్చును. నీరు బాగుగ వడియని కొన్ని జిగురునేలలలో నొకొ్కప్పుడు పచ్చియెరుడు వేసినను చేను దిగనారి తక్కువ పంటనిచ్చుట కిదియే కారణము. కావున పచ్చియెరువు వేయు నేలలలో జలనిర్గమనము బాగుగ నుండునట్లు చూడవలయును. మరియు నీ యెరువు చీకి యందువలన బుట్టిన హానికరములగు ద్రవ్యములు వడిసి లేక నశించిపోయిన పిమ్మటనే అనగా నీ యెరువు వేసిన సుమారు వారము దినములకు పిమ్మటనే వరి పైరును నాటుట మంచిది.

దంప నేలలందు పచ్చి యెరువు గాని యితర సేంద్రియపదార్థములు గాని చీకుట వలన కొన్ని జీవుల సహాయము వలన వరి వేర్లకు కొంత ప్రాణవాయువు కూడ లభించునని 65 వ పుటలో వ్రాయబడెను. ఇట్లు ప్రాణవాయువు అనుకూలముగ లభించుటకు నేలయందు జలనిర్గమనము మిగుల చురుకుగ గాని మిగుల మందముగ గాని యుండకూడదని కని పెట్టబడెను. కావుననే మిక్కిలి యిసుక నేలలును, మిక్కిలి జిగురు నేలలును హెచ్చుగ యెరువు వేసినను తగినంత పంటనీయవు.

పైనిచెప్పిన సస్యముల యొక్కయు, ఇతర చెట్టుచేమల యొక్కయు పచ్చి రొట్టయే గాక, వాని యెండురొట్టయు, రాలిన యాకులును గూడ యెరువుగ నుపయోగించిన కొంత పనిచేయును. కాని యెండు రొట్టగాని ముదురు టాకులు గాని చీకుట కొంత యాలస్యమగును. ముదురుటాకుల లోని నత్రజని పరిమితియు తగ్గిపోవును. అయినను రోడ్ల ప్రక్కలనుండి

రాలు ఆకులు మొదలగువాని నన్నిటిని దొరకిన మట్టుకు శ్రద్ధగా పోగుచేసి వరచేలకు యెరువుగా యుపయోగింపదగును. పశువులు తినుటకు పనికిరానట్టి గాని తినగా మిగిలినట్టిగాని గడ్డి, కొంటు, దంటు మొదలగు నితర స్థూలపదార్థములను కూడ యిట్లుపయోగింప వచ్చును. ఇండ్ల కప్పులనుండి తీసివేసిన ప్రాత తాటియాకు చెత్త, వేరుసెనగ డొల్లలు, రంపపు పొట్టు, వరియాకు కూడ నిట్లుపయోగింప వచ్చును. అంతగా సత్తువగలవి కాకపోయినను నట్టి స్థూల సేంద్రియపదార్థములు జిగురు నేలలను, చౌటి నేలలను గుల్ల బరచి యందలి జలనిర్గమనము వృద్ధిచేసి కొంత వరకు బాగుపరచును.

పచ్చిరొట్ట గాని స్థూలమగు నితర చెత్త చెదారములు గాని సామాన్యముగ చేను బాగుగ నెదుగునట్లు చేయును. చేను బాగుగ నెదిగిన ధాన్యపు రాలికయు హెచ్చుక మానదు. కాని కొన్ని సందర్భములలో చేని పెరకువకు తగినంత పంట పండవలెననిన నేలకు ఎముకల పొడి, అధఃస్ఫురితము మొదలగు స్ఫురపు టెరువులను జేర్చుట యవసరముగ నుండవచ్చును. ఈ విషయమై ముందు మరికొంత వ్రాయబడును.

బీద నేలలలోను, మిగుల త్వరలో పండు వరులకును-ముఖ్యముగా రెండవపంట వరులకు-పచ్చిరొట్టతో నంతకంటె మిగుల చురుకుగ నుపయోగపడు శైలపిష్టములు అమ్మోనియా గంధకితము (సల్ఫేటు) వంటి యెరువు కొంత కలిపి వేయుచో హెచ్చు పంటలు పండునని తేలెను. ఈ విషయమును గురించియు ముందు మరికొంత వ్రాయబడును.

**2. పశువుల యెరువు-ఇతర జంతువుల మూత్రపురీషములు:—** అన్ని సస్యములకు వలెనే వరికిని పశువుల యెరువు ప్రశస్త

తుని వ్రాయుట యవసరములేదు.* మెట్ట వరులకును మొదట వానివలెనే విత్తబడి పిమ్మట నీరు పెట్టబడు వరులకును బాగుగ చీకిన పశువుల యెరువు చాల మంచిది. కాని బాగుగ చీకి యుండని నత్రజని చాల భాగము నత్రిత రూపమున నుండు స్థితిలో దంపవరుల కీ యెరువు వేయు నెడల సంచిత నత్రితములు 116 వ పుటలో వ్రాయబడినట్లు కొంత వఱకు నష్టమగును. కావున దంపవరుల కిట్టి యెరువు పచ్చిరొట్ట యంత యుప యోగకరము గాదు. సమముగు నత్రజని నొసగు పచ్చిరొట్టను పశువుల యెరువును జేసి పరీక్షింపగా పశువుల యెరువు వలన గలిగిన పంట హెచ్చుదలకంటె పచ్చిరొట్టవలన గలిగిన హెచ్చుదల రెట్టింపుండెను 46. కావున పశువుల యెరువును సాధ్యమైనంత వరకు మెట్ట వరులకును తోట పైరులకును నుపయోగించుకొని, వరికి పచ్చిరొట్టను వాడుటయే మంచిది. కాని మెట్ట భూములు గాని తోట భూములు గాని లేనివారు తమ పశువుల యెరువును పూర్తిగ చీకకముందే వరి చేలల కుపయోగింప వలెను. అట్లుపయోగించుచో నందలి సేంద్రియపదార్థము పచ్చి యెరువు వలెనే చేలయందు చీకుట వలన క్రమముగ అమ్మోనియాయును ఆమ్లజనిగను సస్యమునకు లభించు చుండును. పశువుల యెరువు నందలి సారము మరి కొన్ని పంటలకు కూడ కొద్ది గొప్ప మిగిలియుండును. కావున నీ యెరువును రెండు మూడేండ్ల కొకసారి యెకరమునకు 10-20 బండ్ల వరకు తోలదగును.

---

* ఇందు సామాన్యముగ దానిని తయారుచేయు విధానమును బట్టి నూటికి .53 నుండి .97 వరకు నత్రజనియు, .34 నుండి .48 వరకు స్ఫురత్వంచామ్లజనిదమును, 1.90 నుండి 1.79 వరకు పొటాషును ఉండ వచ్చునని లెక్క వేయబడెను.45

వరి నేలలకు పశువులను మందగట్టుట కూడ గలదు. ఇందు వలన వాని మూత్రము నందలి సారము యెండమూలమున కొంత నష్టమయినను చాలవరకు నేలకుబట్టును. పేడయు వెంటనే చిమ్మివేయబడుచో యెండి దుమ్ముచేసి నాటిన పిమ్మట చేకి చాల వరకు సస్యమున కుపయోగించును. పేడకళ్లను చిమ్మకుండ నట్లే యుంచినచో నందు కొన్ని మార్పులు గలిగి కొంత నత్రజని నష్టము కావచ్చును. లేక యితరులు వాని నెత్తుకొని పోవచ్చును. పశువుల మందవలన పూర్తియైన లాభమును పొందదలచుచో అదివరకు బాగుగ దున్ని యుంచబడిన వరియాకు మళ్లలోను, వరికి ముందు యితర సస్యములను సాగు చేయుటకు దున్నిన మళ్లలోను, మందను కట్టి మూత్రమును మాత్రము మళ్లలో నినుకనిచ్చుచు, పేడ నెప్పటికప్పుడు తీసివేసి ప్రక్కన వరి మళ్లలో పిసజిమ్మ వలెను.

వరియాకు మళ్లలో మంద గట్టునపుడు వానికి వరిగడ్డి వేసి మేపుచో అందలి పలురకముల కాయగింజలు కొన్ని మళ్లలో రాలి పిమ్మట జల్లు విత్తులతో పాటు మొలచి కెళీలుగ బయలుదేరును. కావున విత్తదలచిన రకపు లేక వంగడపు గడ్డినే గాని, జనుము మొదలగు నితర మేతను గాని వేసి మేపవలెను.

గొర్రెలను మేకలను కూడ వరి చేలలో మంద గట్టుట గలదు ‡

‡ గొర్రె పెంటికలలో నత్రజని సుమారు నూటికి 0.9 ను, స్ఫురత్పంచామ్లజనిదము సుమారు నూటికి 0.6 ను, పొటాషు స్వల్పముగను ఉండును. మూత్రములో నత్రజని సుమారు నూటికి 1 6 ను, స్ఫురత్పంచామ్లజనిదము స్వల్పముగను, పొటాషు సుమారు నూటికి 2.2 ను ఉండును.

కాని యడవులును బంజరు నేలలును విస్తారమున్న చోట్ల గాని యట్టి మందలను విస్తారముగ పెంచ వీలులేదు. డెల్టా నేలలను కొంచె మించు మించుగా మందలు లభింపవనియే చెప్పవచ్చును. సామాన్యముగ నారు మళ్లకీ మందలు పశువుల మందలకన్న నెక్కువ యనుకూలము. ఏల యన పశువుల మంద కట్టునెడల నిదివరలో వ్రాసినట్లు కేళీలు పెంచుట కవకాశము గలుగును. గొఱ్ఱెలను, మేకలను మంద కట్టుటవలన నట్టి భయము లేదు. కాని మేకలను తుమ్మకాయలు తినుకాలమున మంద కట్టిన యెడల మడిలో తుమ్మ మొక్కలు విస్తారముగ మొలచి నారు తీయు నపుడు వాని ముండ్లు గ్రుచ్చుకొనును. కావున నారు మళ్లలో తుమ్మ కాయల కాలము ముగిసిన పిమ్మటనే మందగట్టుట మంచిది. లేక మొలచిన తుమ్మ మొక్కలను జాగ్రత్తగ దీసివేయవలెను.

సామాన్యముగ నారుమళ్లకు యెకరమునకు 1000 మొదలు 2000 వరకును మేకలను, గొఱ్ఱెలను మంద కట్టవచ్చును. ఇతర మళ్లకు అనగా నాటబడు మళ్ళకుకూడ కొందరీ మందలను గట్టుటగలదు. కాని సామాన్యముగ నీ మందకై వెచ్చించు సొమ్ముతో ఇతర స్థూలసేంద్రియ పదార్థములను సంపాదించి వేయుటయే లాభకరముగ నుండును.

పశువులను, గొఱ్ఱెలను, మేకలను మంద గట్టుటవలన నేలకు సత్తువ గలుగుటయే గాక దాని గుల్లదనము కూడ కొంతవరకు తగ్గును.

పంది పెంట కూడ వరికి బలమైన యెరువుగ పరిగణింప బడుచున్నది.* కొందరు యెండిన పందిపెంటను పశువులచే ద్రొక్కించి, ఆ పొడుం

* పందియొక్క పచ్చిపెట్ట యందు నూటికి 0.7 పాళ్లు నత్రజనియు, నూటికి 0.45 పాళ్లు స్ఫురత్వంచామ్లజనిదమును ఉండునని లెక్క వేయబడెను.

మును మళ్ళలో చేను మూన తిరిగిన పిమ్మట జల్లుదురు. కొందరు పేడతో కలిపి కుప్పవేసి, ముక్కనిచ్చి రెంటిని కలిపి యెరువుగా వేసె దమ్ము చేసి నాటుదురు. దీనివలని లాభ నష్టములను దెలుపు అంకెలు లేవు. కాని సామాన్యముగ బస్తా 1 కి 0-8-0 లు చొప్పున నీ యెరువును కొని యెకరమునకు 10 బస్తాల చొప్పున వేసిన యెడల నదే సొమ్ముతో బస్తా 1 కి రు 4 ల చొప్పున వేరుసెనగ పిండిని కొని వేసిన దానికంటె హెచ్చు లాభము వచ్చునని చెప్పవచ్చును.

ఈ యెరువు లాభకారిగ నున్నను వ్యవసాయదారులు వాడుటకు సామాన్యముగ వెనుదీయుదురు. అసహ్యత దీనికి ముఖ్యకారణము. ఈ యెరువు వేసి పండించిన ధాన్యము జబ్బుచేయునను యనుమానము రెండవది. ఈయెరువు యేటేట వేయు నేలలో క్రమక్రమముగ పాడుదేలునని కూడ కొందరి నమ్మకము. ఈ విషయము నింకను పరీక్షింపవలసి యున్నది.

మానవమూత్ర పురీషముల నీదేశమునందు వరిచేల కెరువుగా వాడుట యరుదు. పునహా, చెన్నపురి మొదలగు పెద్ద పట్నముల సామీప్యమున కొంతవర కుపయోగింప బడుచున్నది.* జపాన్, చైనా దేశములలో విశేషముగ వాడబడు చున్నది. చెన్నపురి ప్రాంతము లందు దీనిని పశు

---

* మునసిపల్ సంఘములు మానవమూత్ర పురీషములను పట్టణపు వెలుపలికి పంపి అచట సామాన్యముగ గోతులలో వేయించి కప్పించెదరు. అది సుమారు 6-12 నెలలు చీకిన వెనుక ఆ ప్రాంతములందు వ్యవసాయదారులు కొని తీసికొని పోవుచుందురు. పునహా ప్రాంతములందు బూడిదలో పొరలు పొరలుగా వేసి కలిపి 15 దినములలో నుపయోగార్హ మగు నట్లొండ బెట్టుదురు. జపాన్, చైనా మొదలగు కొన్ని చోట్ల

వుల యెరువుతో గాని, పెంటతో గాని చేర్చి వాడుదురు. సామాన్యముగ నీ యెరువు ఎకరమునకు 3 బండ్ల చొప్పున 6 బండ్లు పశువుల యెరువుతో గాని పెంటతో గాని కలిపి వేయుదురు. ఇట్లు వేసిన పిమ్మట రెండు పంటలు బాగుగ ఫలించును. ఈ యెరువు గడ్డిని విస్తారము వృద్ధి చేయును.

పందిపెంట నలెనే యీ యెరువు కూడ తగుచు వాడిన యెడల నేల చౌడెక్కునందురు. కాని యీ విషయము గూడ నింకను పరీక్షింపవలసి యున్నది.

ఒక్కొకచో గుర్రములు, గాడిదలు మొదలగు నితర జంతువుల పురీషము గూడ దంప వరి కెరువుగా వాడవచ్చును.

**4. తైలపిష్టములు—చేపల యెరువు మొదలగు సారవంతములగు సేంద్రియపు టెరువులు:—** నత్రజని మెండుగ గల్గి త్వరలోఁ చీకి అమ్మోనియా నొసగు వేరుసెనగపిండి మొదలగు నానాజాతుల గానుగ పిండియు చేపల యెరువును చురుకుగ బనిచేయవలసి నపుడు వరి

---

సున్నము మొదలగు వానితో గలిపి యెండించి ఇటుకల రూపము చేసి వానిపొడి నుపయోగించుట కలదు. ఇట్లు సిద్ధము చేసిన యెరువుకు "పూడ్రెట్టు" అని పేరు. ఇట్లు తయారు చేసిన యెరువునందు నూటికి 1-1.4 నత్రజనియు, 1-2.7 స్ఫురత్పాంమ్లజనిదమును, 0.5 పొటాషును ఉండునని లెక్క వేయబడెను. గోతులలో చీకిన యెరువునందు నూటికి 0.37 నత్రజనియు, 0.11 స్ఫురత్పాంమ్లజనిదమును, 0.15 పొటాషును ఉండునని కనుగొనబడెను.[47]

కెరువుగ నుపయోగింపదగి యుండును¶. కాని యీయెరువులు వరికివలయు అమ్మోనియా నొసగుటకే పనికివచ్చును. వీనిమూలమున పచ్చిరొట్ట పశు

---

¶ ఆయాజాతుల గానుగపిండి యందును, చేపల యెరువు మొదలగు జంతు సంబంధమగు యెరువు లందును సామాన్యముగ నుండు నత్రజని యొక్కయు స్ఫురితవ్వంచామ్లజనిదము యొక్కయు పరిమితి యీ క్రింది పట్టికలో తెలుపబడును.

| | | నత్రజని నూటికి | స్ఫు. పం. నూటికి |
|---|---|---|---|
| 1. | వేరుసెనగ పిండి | 7 00 | 1 25 |
| 2. | ఆముదపు పిండి (పొట్టుతీసినది) | 6.50 | 2 25 |
| 3. | ,, (పొట్టు తీయనిది) | 4.50 | 1.25 |
| 4. | కుసుంబా పిండి | 5.00 | 1.25 |
| 5. | వేపపిండి | 5.00 | 1.50 |
| 6 | వలిసెపిండి | 4.50 | 2 25 |
| 7. | కానుగపిండి | 3.50 | 0.50 |
| 8. | కొబ్బెర పిండి | 3.25 | 1 00 |
| 9. | ప్రత్తిగింజల పిండి | 3.00 | 1.25 |
| 10. | ఇప్పపిండి | 2.25 | 1.00 |
| 11. | చేపల యెరువు (చమురు తీసినది) | 8.00 | 8.00 |
| 12 | ,, (చమురు తీయనిది) | 4.50-6.50 | 4.00-5.50 |
| 13. | రొయ్యమీసము | 4.00 | ? |
| 14. | కొమ్ముపొడి[56] | 10.20 | 5.5 |
| 15. | రక్తపుపొడి[56] | 11.80 | 1.2 |

వుల యెరువు మొదలగు వాని మూలమున జేరునంత సేంద్రియ పదార్థము నేలకు జేరకపోవుటచే మొక్కల వేళ్లకు ప్రాణవాయువును గూడ నంద జేయుట కీ యెరువు లంతగా తోడ్పడవు. అంత నిలుకడగను బని చేయవు అందుచే చాలచోట్ల నీ యెరువుల కగు వ్యయమునకు దగి నంత పంట పండదు

మరియు వీనిని సొమ్ము పెట్టి కొనవలసి యుండుటచే నవి తగినంత చౌకగ లభించిన గాని, లేక ధాన్యపుధర మిగుల హెచ్చుగనున్న గాని కిట్టు బాటుగ నుండవు కావున పచ్చిరొట్ట గాని యితర స్థూలసేంద్రియ పదార్థము గాని లభింప నప్పుడును, యే కారణమున గాని చేని పెరుగుద వెనుకబడి చురుకుగ నెదిగింపవలసి వచ్చినపుడును మాత్రము వీనిని మెల కువతో వాడవలెను.

వేరుసెనగ పిండి తెలపిష్టము లన్నిటిలోను హెచ్చు నత్రజని గలది. శ్రేష్ఠమగు వేరుసెనగ పిండి ( expeller cake ) లో నత్రజని నూటికి 8.0 వరకు గూడ నుండుట గలదు. నత్రజని తక్కువగ నున్నను కొన్ని చోట్ల వేపపిండి, పలిసెపిండి, కానుగపిండి మొదలగునవి చౌకగ దొరకుట చే నుపయోగింప దగియుండును. వేపపిండి చౌటి నేలలకు మంచిదనియు కొంత వరకు కీటకనివారమనియు ప్రతీతి. కాని ఈ విషయమై తగిన పరిశోధనలు జరిగియుండలేదు.

చేపల యెరువులో నత్రజనియే గాక స్ఫురము హెచ్చుగ గలదు. కాని యీ యెరువు పడమటి సముద్రతీరమునుండి రావలసి యుండుటచే కిట్టు బాటుగ నుండుటలేదు. రొయ్యమీసము తూర్పుసముద్ర ప్రాంతము లందు దొరకును. లభించినంత వర కుపయోగింప దగును. కొన్ని కసాయి

దుకాణముల వద్ద గక్తపు యెరువు గాని, పొడి గాని దొరకును. ఇది చురుకుగ బనిచేయును.

ఇట్టి సారవంతమైన యెరువులను వేయుచో పైని చెప్పినట్లు సస్యమునకు వలయునంత స్థూల సేంద్రియపదార్థము నేలకు నీగక పోవుటయే వీని ముఖ్యలోపము. కావున నివి చౌకగ లభించినపుడు వీనిని పచ్చిరొట్ట, పశువుల యెరువు మొదలగు వానితో సంయోగము చేసి వాడుట మంచిది.

కొమ్ముల పొడి, డెక్కల పొడి యివి దువ్వెనలు మొదలగునవి చేయు కార్ఖానాలలో దొరకును. వీనిలో నత్రజని హెచ్చుగ నున్నను అవి నెమ్మదిగ చీకి యాలస్యముగ బనిచేయును. చౌకగ దొరకుచో నుపయోగింప దగును.

5. అమ్మోనియా గంధకితము ( సల్ఫేటు ), ఖటికసయనమిదము, సోడియనత్రితము:— ఈ మూడును నత్రజని హెచ్చుగా గల కృతకములగు నిరింద్రియపు యెరువులు. వీని యందలి నత్రజని పరిమితి యీ క్రింద చూపబడును.

| | నత్రజని నూటికి |
|---|---|
| అమ్మోనియాగంధకితము | 20.5 వంతులు |
| ఖటికసయనమిదము | 20.6 ,, |
| సోడియనత్రితము | 15.0 ,, |

ప్రస్తుతము జరుగుచున్న ఐరోపా సంగ్రామమునకు బూర్వము అమ్మోనియాసల్ఫేటు ధర తక్కువగ నుండుట చేతను మిగుల చురుకుగ పనిచేయుటచేతను వరి కెరువుగా నిది కొన్ని చోట్ల విరివిగ వాడుకలోనికి వచ్చెను. కాని యీదుమూలమున నేలకు సేంద్రియపదార్థ మేమియు జేరక పోవుటచే దీని యుపయోగము తాత్కాలికము. కావున నీ యెరువు తగినంత చౌకగ నున్నపుడును, స్థూలమగు నితర సేంద్రియపు టెరువులు తగినంతగా దొరకనపుడును మాత్రము వానితో కలిపి వాడవలయును. ఉపాంతరములచే చెడిన చేలను, ప్రతికూల పరిస్థితులందు పెరుగు పునాస (రెండవ పంట) వరులను చురుకుగ నెదిగించుటకు ఒక్కొకప్పు డిది ప్రయోజనకారిగ నుండును.

చామర్లకోట క్షేత్రమున 6 సంవత్సరముల తణిఖీలో ఎ. 1 కి 112 పౌనుల చొప్పున చేను మూనతిరిగిన పిమ్మట వేసి పరీక్షింపగా ధాన్యపు రాలిక సగటున యెరువువేయని మళ్ళలో కంటె ఎకరమునకు నూటికి 8 చొప్పునను గడ్డి సుమారు 20 చొప్పునను హెచ్చెను. కాని యెరువు ఖరీదు పోను నికరలాభము ఎకరమునకు సుమారు రు 2 లు మాత్రమే యుండెను. యెరువును పస్యంయుచు నాటిన కాలమునగాక వెన్ను వేయుటకు సుమారు రెండు నెలలు ముందుగా వేయుట మంచిదని యిటీవల పరిశీలన వలన తేలెను38. 2000 పౌనుల పచ్చిరొట్ట మాత్రమే వేసిన మళ్ళలోకంటె దీనికి తోడు నూరు పౌనుల అమ్మోనియా గంధకితము వేసిన మళ్ళలో మారుటేరు క్షేత్రమున రెండు సంవత్సరములపై ధాన్యపు రాలిక సగటున నూటికి 36 వంతులు హెచ్చెను. పై పరిక్షా ఫలితములను బట్టి చూచిన మొదట పచ్చి యెరువును గాని, పశువుల యెరువును గాని వేసి వీనివలన గలిగిన యేపు తగ్గిన పిమ్మట అమ్మోనియాగంధకితము వేయుట యుక్తమని తోచును.

అమ్మోనియాగంధకితపుసస్తువ వేసిన పంటకే గాని తరువాతి పంట కింతగా నిలువదు మరియు దీని నేలకేటవేసి సస్యములను పండించుచో యెరువు వేయుట మానిన పిమ్మట మొదటి రెండేండ్లు నెరువు వేయని మళ్ళలో కంటె వీనిలో పంట తగ్గిపోవునట్లు ఋజువయినది.

ఖటిక సనయనమిదము కూడ నేలలో వేసెను పిమ్మట మార్పునొంది అమ్మోనియా నొసగును. కాని యిది ఘాటగు వస్తువగుటచే దీనిని సస్యము నాటిన పిమ్మట వేసిన నది చెడును. కావున దీనిని నాటుటకు రెండు మూడు దినములు ముందే వేసి పట్టెతోలవలెను ఇట్లు జాగ్రత్తగ వేసినను దీనివలన అమ్మోనియాగంధకితము వలన గలిగినంత మంచి ఫలితము గలుగలేదు[4 g]. మరియు అమ్మోనియాగంధకితము కంటె నిది చౌకగ దొరుకుట గూడ లేదు.

దంపవరికి సోడియసత్రితము వేయుచో నందు సస్యము పెంటనే తీసికొనగా మిగులునది చాలవరకు నీటితో కొట్టుకొని పోవుట కవకాశము గలదు. కావున నిది దంపవరికి పై రెండు నిరింద్రియపు యెరువులంత యనుకూలము గాదు. తగినంత చౌకగ లభించుచో సోడియ సత్రితమును వరి నారునకును, ముందు వర్షాధారమున విత్తి తరువాత నీరు కట్టు మళ్ళలోను చురుకుగ బనిచేయవలసి వచ్చినపుడు ఉపయోగింప వచ్చును.

**6. ఎములపొడి, అధిస్ఫురితము మొదలగు స్ఫురపు యెరువులు:—** వరి చేలకు నత్రిజనితోపాటు గాని ప్రత్యేకముగ గాని స్ఫురపు యెరువులు వేయుట కూడ లాభకరముగ నుండవచ్చును. వీనిలో

ముఖ్యమైనది ఎముకల పొడి. ఇందు స్ఫురత్పంచామ్లజనిదము సుమారు నూటికి 23 ఉండును. కాని యిది వెంటనే సస్యము తీసికొనదగిన స్థితిలో నుండదు. ఎముకలపొడిని నేలలో వేసినపిమ్మట నదిచీకి అందలి స్ఫురత్పంచామ్లజనిదము క్రమముగ ద్రావణీయమగును. పొడి యెంత మృదువుగ నున్న నంత త్వరలో చీకును. మరియు నిది పచ్చి రొట్ట, పశువుల యెరువు మొదలగు సాంద్రియపు టెరువులతో కలసి చీకుచో నందలి స్ఫురత్పంచామ్లజనిదము మరింత త్వరలో ద్రావణీయమగును. కావున దీని నట్టి యెరువులతో కలిపి వాడుట చాల మంచిది. సామాన్యముగ సెకరమునకు తొలి సంవత్సరము 224 పౌనులు వేసి పిమ్మట ప్రతి యేడును 112-168 పౌనుల వరకు వేయవచ్చును. స్ఫురత్పంచామ్లజనిదము మంటికి బాగుగ పట్టి నత్రితముల వలె నీటితో కలసి కొట్టుకొని పోదు. కావున మొదట కొంచెము ఎక్కువగ వేసినను అది నేల యందుండి క్రమముగ పని చేయును. ఎముకల పొడిలో నూటికి సుమారు 4 వంతులు నత్రజని గూడ యుండును.

ఎముకలందు వలెనే స్ఫురత్పంచామ్లజనిదము విస్తారముగా గల యొక విధమగు రాళ్లు దక్షిణ యిండియాలో కొన్ని చోట్ల నేలనుండి త్రవ్వి తీయబడుచున్నవి. వీనిని గూడ పొడిచేసి యెముకలపొడికి బదులు వాడు చున్నారు. కాని యిందలి స్ఫురితము ఎముకల పొడి యందలి స్ఫురితములకంటె కొంచెము మాలస్యముగ ద్రావణీయములగును. ఎముకల పొడి యందలి స్ఫురత్పంచామ్లజనిదము గాని, ఖనిజస్ఫురితము లందలి స్ఫురత్పంచామ్లజనిదము గాని త్వరలో సస్యమున కుపయోగించు స్థితిలోనికి దెచ్చుటకు వానిని గంధకి ధృతిలో గలిపి అధిస్ఫురితములుగ తయారు చేయుట యొక సులభమైన యుపాయము. ఇట్లు తయారుచేసిన అధిస్ఫురితము లెరువుల వర్తకులచే విక్రయింప బడుచున్నవి. శల్యాధి

స్ఫురితమున అనగా యెముకల పొడినుండి తయారు చేసిన యధిస్ఫురితమున స్ఫురత్వంచామ్లజనిదము సుమారు నూటికి 16 ఉండును. కాని నత్రిజని నశించిపోను. సామాన్యముగ పచ్చిరొట్ట, పశువుల యెరువు మొదలగు స్థూలమగు యెరువులలో యెముకల పొడిని వాడుటయు, శైలపత్రములు, అమ్మోనియాగంధకితము మొదలగు వానితో అధిస్ఫురితములను వాడుటయు అనుకూలము. అధిస్ఫురితములను ఎకరమునకు సామాన్యముగ 112-168 పౌనుల చొప్పున వేయవచ్చును.

అధిస్ఫురితములు కృష్ణా జిల్లాలోని పరిభూములకు మంచి పని జేయుచున్నవని ఆ ప్రాంతము లందలి వ్యవసాయదారులు అనుభవము వలన గనుగొనిరి. కేవలము స్ఫురము నొసగుట వలననే గాక నేల యందు కొన్ని యితర రాసాయనిక మార్పులు గలిగించుట వలననే వీనిని వేసిన నేలలలో హెచ్చు పంటలు పండుచున్నవి

ఇటీవల అమ్మోనియాతో స్ఫురము రసాయన సంయోగము నొందించి రెండును చేరి సస్యమునకు వెంటనే యుపయోగించు స్థితిలో నుండు యెరువులు కొన్ని తయారు చేయబడు చున్నవి. అందు అమ్మోఫాస్, నిసిఫాస్ అను రెండును ముఖ్యములు. వీనిలో కూడ అమ్మోనియా యొక్కయు స్ఫురము యొక్కయు పాళ్ళలో హెచ్చు తగులు గల రకములు తయారు చేయబడు చున్నవి. అందు ముఖ్యమైన వాని సంఘట్టనము క్రింద జూపబడెను.

| | నత్రజని నూటికి | స్ఫురత్వం చామ్లజనిదము నూటికి |
|---|---|---|
| 1. అమ్మోఫాస్ 20/20 | 20 | 20 |
| 2. ,, 13/48 | 13 | 48 |
| 3. డై అమ్మోఫాస్ 20/53 | 20 | 53 |
| 4. ల్యూనాఫాస్ 20/20 | 20 | 20 |
| 5. నిసిఫాస్ 22/18 | 22 | 18 |

చురుకుగ పని చేయవలసిన సందర్భములలో నివి యనుకూలముగ నుండవచ్చును. వీనిని గూడ పచ్చి రొట్ట మొదలగు స్థూలసేంద్రియపు యెరువులతో గలిపి వాడుట మంచిది. ధర మిగుల తక్కువగ నుండిన గాని యివి పచ్చి రొట్ట, యెముకల పొడి లేక పశువుల యెరువు వేసినంత లాభకరముగ నుండవు.

7. ఇతర యెరువులు :— వరి చేలకు లాభకరముగ నుపయోగింపదగు నితర యెరువులలో నీ క్రిందివి ముఖ్యములు:-

(a) పాటిమన్ను:—పురాతన గ్రామ కంఠములనుండి త్రవ్వబడు నీ మంటిలో సుమారు నూటికి 0.04 నత్రజనియు, 0 60 స్ఫురత్వచామ్లజనిదమును, 1 39 పొటాషును, 2 60 సున్నమును ఉండునని లెక్క వేయబడెను[48]. ఈమంటిని కృష్ణా గోదావరి జిల్లాలలో విరివిగ వాడుచున్నారు. జిల్లా నేలలలో దీనికి సాటియగు యెరువు మరియొకటి లేదని యనుభవము వలనను తణిఖీల వలననుగూడ తేలెను. కాని యిది గత 50,60 సంవత్సరములలో చాల

వరకు తవ్వివేయబడుటచే నిటీవల నిది లభ్యమగుట కష్టముగ నున్నది. ఇది నేలకు కొంత సారమును జేర్చుటయే గాక డెల్టా నేలల వంటి జిగురు నేలల భౌతిక స్థితిని కూడ కొంత వరకు మార్చుటచేతనే దీని నొకసారి వేసిన చోట్ల కొన్ని సంవత్సరముల వరకు మంచి పంటలు పండుచున్నవని యూహింపబడు చున్నది. కాని దీనికి బదులుగ నుపయోగింప దగిన యెరువులను గూర్చిన పరిశోధనలు పూర్తిగ సఫలములు గాకపోవుటకు గారణము ఈయెరువు తత్వమును పూర్తిగ గనిపెట్టక పోవుటయే గావచ్చును. పచ్చిరొట్టను అవసరమగుచో యెముకల పొడి, లేక అధిస్ఫురితముతో జేర్చి వేసిన పాటి మట్టివలె కొంత వరకు పనిజేయును. కాని డెల్టాలలో నీ రొట్టను వేయుట కన్ని చోట్లను వీళ్లు కుదురక పోవుట చేతను, అన్ని నేలలలోను పాటి మంటి యంత బాగుగ పనిచేయక పోవుట చేతను యీ సమస్య యింకను తీరెనని చెప్పవీలులేదు. దొరకినంత వర కెంత ధర పెట్టియైనను యింకను పాటి మంటినే వాడుట తప్పులేదు. సామాన్యముగ నీ మన్ను ని పుడలు 10 సంవత్సరముల కొకసారి 50 మొదలు 100 బండ్ల వరకు తోలవలసి యుండును

(b) ఊరిపెంట:- సామాన్యముగ గ్రామములలో కూడబెట్టు పెంట గూడ కొంతవరకు పాటిమంటి వలెనే పనిచేయును. దానిలో కంటె సేంద్రియ ద్రవ్యమును, నత్రజనియు హెచ్చుగ నుండును. బూడిద విస్తారముగ చేరి యుండుటచే దీనిని పొటాషు లోటుగనున్న నేలలకు ఆ లోపములను దీర్చుటకై వాడవచ్చును. ఇందు సున్నముగూడ హెచ్చుగ నుండుటచే నా లోపము గల నేలలకు గూడ పని చేయును. కాని ఆయా చోట్ల [illegible] సంశోధనల వలన ఈ ప్రాంతములందు పొటాషుగాని, సు[illegible] వేసవలసిన యగత్యము మిగుల యరుదని తేలెను.

